ఇందు ప్రకటించిన ప్రహసనముల పేర్లు



## కవిసింహాగర్జితములు



## అపూర్వకవి[illegible]ము

## స్[illegible]ం పిల్లలప్రహసనము

శ్రీమత్పరదేవతాయైనమః

# కవిసింహగర్జితము



శ్రీ

## తిరుపతి వేంకటేశ్వర కవులు

శతావధానులు.



ప్రకాశకులు :

చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి సన్సు,

వేంకటేశ్వర పబ్లికేషన్సు

కడియం P. O.

తూర్పు గోదావరి జిల్లా.

1955

★



* ఇందువచ్చు పాత్రలు *

గు రు వు

శి ష్యు డు

★

# కవిసింహాగర్జితములు



[ తిరుపతి వేంకటేశ్వర కవులు ]

(గురుశిష్యులిరువురు ప్రవేశింతురు)

గురు— ఏమోయి, పాఠము చదివెదవా!

శిష్యు— నేఁ డనధ్యయనముకదా!

గురు— అట్లేని యేవిషయముననేని సందేహములున్నచోఁ దీర్చి కొందువుగాక.

శిష్యు— చిత్తము. అప్పకవీయమునఁ బ్రథమాశ్వాసమున.

తే. గీ. తనకుఁ దెలియనివన్నియుఁ దప్పు లనుచుఁ
గుకవి హాస్యంబు గావించు సుకవివరుఁడు,
తడవుఁ జర్చించి తెలియు నంతటను దెలియ
కున్నఁ దద్దయుఁ బెద్దలయొద్దఁ దెలియు॥

అని వ్రాసియున్నాఁడుకదా! ఏదో వెఱ్ఱిమొఱ్ఱికవిత్వమును జెప్పువా రెల్ల దీని నాధారము చేసికొని తమతప్పుల నొప్పులుగా సమర్థించుకో వచ్చునా!

గురు— ఈపద్యమువలనఁ దప్పుడుకవిత్వము సమర్థించు టనఁగా నర్థ మేమి!

శిష్యు— అర్థమున కేమున్నది చిత్తగింపుఁడు. గరుడాచలనాటకాదులలో "చెట్టుయెక్కఁ గలవా! నరహరి! చెట్టు యెక్కఁ గలావా!" లోనగుతప్పులతడకల కవిత్వము లున్నవికదా! తద్గ్రంథకర్త నెవ్వరేని యాక్షేపించినప్పు డతఁ డీయప్పకవీయపద్యము చదివినచో నయ్యది సమర్థింపఁ బడునా!

గురు— బాగు, మంచిప్రశ్న వేసినావు కాని అప్పకవి తాత్పర్యమును ముందు మనము విచారణచేయవలెను. అతఁడు సుకవులకవనమున నజ్ఞానముచే నెవరేని యొప్పునే తప్పనుకొన్నప్పు డిది యుపయోగింప వలసిన దనునభిప్రాయముతో వ్రాసి యుండును గాని ప్రతికుకవియును దనతప్పుడుకూఁతలను సమర్థించుకొనుటకును బ్రాజ్ఞుల నప్రాజ్ఞులు దూషించుటకును నుపయోగింప వలె నని వ్రాసియుండఁడు. కావుననే కవిస్తుతియందను

తే. గీ, కాళిదాసమయూరాదికవులకైనఁ
గలవు తప్పులనంగ నన్యులకు లేవె?
దిద్దఁ దగుపట్ల దిద్దుఁడుదిద్దరాని
యెడల నా నేరములు క్షమియించు టొప్పు.

అని వాక్రుచ్చియున్నాఁడు.

శిష్య— అట్లు వ్రాసి యంతతో విరమింప లేదు గదా!

క. వినఁదగు వెండియుఁ బొత్తముఁ
గనఁదగు బుధజనుల నడుగఁగాఁ దగుఁ గాకెం
దును దెలియనిపట్టునఁ ద
ప్పనవల దని భావిజనుల కంజలి మోడ్తున్॥

అని కూడ వ్రాసియున్నాఁడు.

గురు— సత్యమే, తాను జెప్పినట్లు సర్వవిధముల విచారించఁగాఁ గూడఁ దప్పయినచోఁ దప్పనుకొన వలదని తాను జెప్పినను మానరుగదా! కావున దీనితాత్పర్య మిట్లు గ్రహింపఁదగు. అయ్యా! చెప్పఁ బోయెడిది లక్షణగ్రంథము గాని తందనపదములు గావు. కావున విశేషపరిశ్రమ లేనివారు తమయజ్ఞానమును నాయందారోపించి నన్నును నాకష్టమును వృథా సేయకుఁడు. మిమ్మందులకై నేను సవినయమ్ముగఁ బార్థించుచున్నాను. అని దానితాత్పర్యము గాని ప్రతికుకవియును నేవో నోటికివచ్చినట్లెల్లఁ

జెప్పి వానినిఁ దప్పు లని యెవరేని యన్నచో నీయప్పకవిపద్యములవలనఁ గృతార్థత్వము సంపాదించుకొనుటకుఁ గాదు. దోషజుష్ట మగుకవిత్వమును పరిహసించుటయితనికినిసమ్మతమే. రెండవయాశ్వాసములోని.

క. గుర్తిడ్డి యగునెద్దు జొన్నను
బడ్డపగిది లక్షణంబుపథమెఱుఁగనియా
యెడ్డె కవిత్వము చెప్పిన
నడ్డంబై బుధు లదల్ప నది యేమగునో॥

అనుపద్యమువలన నీతని యభిప్రాయము తేలుట లేదా!

శిష్యు— చిత్తము. బోధపడినది. ఆహేతువుననే కాఁబోలు.

తే. జల్లిపదములు నాలుగు సంతరించి
గురువు లిడుచోట లఘువులు గొన్ని కూర్చి
విరతి గూడకమీఁదులు వెదకి కొనుచు
నచ్చుపొల్లులపై నుంచునతఁడు కవియె॥

అనికూడ నసమర్థులను దూషించియున్నాఁడు, కాని యీపద్యము తరువాత.

తే. గీ. వర్ణము గని నిర్మలాంగంబు వదలునీఁగ
యనఁగుకవి తప్పు గని యొప్పు నణఁచిపుచ్చు,
జల ముడిగి పాలు ద్రావుహంసంబుకరణిఁ
దప్పు విడనాడి యొప్పుసత్కవి గ్రహించు॥

అని కూడ వ్రాసి యున్నాఁడు. దీనిం బట్టి యున్నంతలో గుణమునే గ్రహించుట యుత్తమధర్మముకదా!

గురు— సత్యమే, గుణబహుళమును దోషవిరళమును నగుగ్రంథముల నట్లేకైకొందురుగాక. ప్రతిపదదోషభూయిష్ఠ మగుగ్రంథమునకైనచో నేమి చేయ వలయును. హంసము పాలును నీరును గలిసినచోఁ బాలు మాత్రము గ్రహించును గాని కేవలనీర మున్నచో నందుం బాలను దీయఁ

గలదా! నే నొకటి చెప్పెద నాలకింపుము: రసవత్తరమైనకవిత్వమైనచో నంచెక్కడనేని భ్రాంతివశమునఁ బడినతప్పులను సహించకపోవుట యన్యాయము కాని తప్పులతడకచప్పకవనమున్ జూచి మెచ్చుకొనకుండుట యొకదోషము కాదు. బ్రాహ్మణుఁడు మాలవానిని దూరముగా నుండు మనుటయుఁ దప్పే యగునా!

శిష్యు— విచిత్రము. తాము సెలవిచ్చినది నామదికి వచ్చినది కాని కొన్నిగ్రామములలో మాలవాం డ్రింటుక నాగరికతకు వచ్చి బ్రాహ్మణు లనే దూరముగా నుండుఁ డని యదల్చుచున్నారే!

గురు— దానికి నే నేమి సమాధానము చెప్పుదును.

శా. చండాలుం గని బ్రాహ్మణోత్తముఁడు "నీచా! రాకు దూరమ్ముగా
నుండుండుండు మటన్న నొప్పు నది వేదోక్తమ్ముగానన్: ద్విజున్
జండాలుండును నట్లెపల్కఁదననీచత్వశ్వపాకత్వముల్
నిండారంగ నెఱింగియున్, జగము వానిన్ మెచ్చిపో నిచ్చునే!

క. కులటన్ గులటా యన! నది
కులకాంతన్నూఱుసార్లుకులటా! యను న
వ్వులనవ్వు నవ్వులరఁగఁ
గులటలె యని గేరి మెచ్చుకొనుఁ దనవేర్పన్॥

క. కుకవిన్ గుకవికదా! యని!
కుకవీ యని యందుమేనిఁ గుకవియు సుకవిన్
గుకవీ కుకవీ! కుకవీ!
కుకవీ! యని నూఱుసార్లు గూయఁగఁ దొడఁగున్॥

శిష్యు— తాము సెలవిచ్చినవన్నియు నిపుడు లోకమునఁ గనుపట్టుచున్నవే! యిట్టిపట్టున యథార్థ మెట్లు తెలియును.

గురు— కడు సులభముగాఁ దెలియఁగలదు. ప్రాజ్ఞలోకమునకు గుణపక్షపాతము మెండు. వారుతమతమ ప్రజ్ఞానేత్రమువలన మంచిచెడ్డలు నిర్ణయించు

కొని చీవాట్లు పెట్టఁదగువారిని జీవాట్లు పెట్టుచుందురు. వారికి మిత్రత్వ శత్రుత్వాదికముతోఁగూడఁ బనిలేదు.

శిష్యు— చిత్తము, వజ్రమునకును గులకరాతికినిం గల భేదము రత్నపరీక్షకులకుఁ దెలియక పోదు. గులకరాతిని గూడ వజ్రముగా సమ్మతింపకుండుట పరీక్షకుల కొకదోషము కాదు. ఇఁక నొకమనవి. అప్పకవి యీ ప్రకరణమందే.

క. భ్రష్టులు తామే సర్వో
త్కృష్టకవుల మనుచు సభఁ జరింతురు "బాణో
చ్ఛిష్టం జగత్త్రయ" మ్మను
నష్టాక్షరముననుం గాదె యణఁకువమదికిన్॥

అని వ్రాసి యున్నాఁడుకదా ! ఇతనియుద్దేశమేమి ?

గురు— ఉద్దేశము కనుపట్టుచునే యున్నది. భ్రష్టులైనవారు సభలో నుత్కృష్టత్వము సంపాదించుకొనుటకై యది చదివితి మిదిచదివితిమని రానివిద్యలు వచ్చినట్లుసిగ్గుడిగి నటింతురేని యవమానాస్పదులగుదురని యప్పకవి తాత్పర్యము. సర్వోత్కృష్టులు సర్వోత్కృష్టులుగా సభయందు వర్తించుటయప్పకవికిని సమ్మతమే. కావుననే బాణునిమాటఁ దలపెట్టినాఁడు. వినలేదా ! బాణునిప్రతిజ్ఞ—

శ్లో. నిశ్వాసోఽపి ననిర్యాతి బాణే హృదయవర్తిని,
కింపునః ప్రకటాటోపపదబద్ధా సరస్వతీ॥

ఇట్లు తనయుత్కృష్టత్వమును వెల్లడించెనుగదా ! ఇతఁడుగూడ భ్రష్టుఁడే యగునా ! కావున సమర్థులు సభలలో నిరాఘాటముగాఁ బ్రవర్తించుట యప్పకవికిని సమ్మతమే. భ్రష్టుల కప్పకవియు నుత్కృష్టత్వమొప్పఁడు. మఱియొకకవియును నొప్పఁడు.

శిష్యు— చిత్తము "నహ్యేకం లక్ష్యం యోగారంభం ప్రయోజయతి" యనుటవలన నొక రెవరో యట్లు స్వప్రతాప ప్రకటన మొనరించు

కొన్నను నంతమాత్రమున లోకమువాని నొకసదాచారముగా గ్రహింపమకదా !

గురు— (సకోపస్మితముతో) ఒక లెవరో యనికూడ ననాదరించు చున్నావు ! ఇట్లు చెప్పికొన్న మహాకవులనేకులు గలరు. అని యన్నియుఁ జెప్ప మొదలిడుట కన్న వారివారిగ్రంథములు చదివికొమ్మనుట యుక్తము. అయినను దిఙ్మాత్ర ముదాహరించెదను.

శ్లో. ఆమూలాద్రత్నసానో ర్మలయవలయితా దాచకూలాత్పయోధే
ర్యావంత స్సంతికావ్యప్రణయనపటవస్తే విశంకంవదంతు.
మృద్వీకామధ్యనిర్యన్మసృణమధు ఝురీమాధురీభాగ్యభాజాం
వాచా మాచార్యతాయాః పద మనుభవితుం కోఽస్తి ధన్యో మదన్యః॥

అని శ్రీజగన్నాథ పండితరాయలు సభలోఁ దనయుత్కృష్టత్వమును బ్రకటించె.

శిష్య— (అత్యాశ్చర్యముతో) లోకములో మృదుమధురవాఙ్మహో పాధ్యాయత్వము నొందుట కిమ్మహామహుఁడే తగినవాఁడనునంశ మతని ప్రతిజ్ఞాశ్లోకమే వేనోళ్ళ నుద్ఘోషించుచున్నది. అవును. ఎంతవాఁడును గానిచో నప్పయ దీక్షిత భట్టోజీదీక్షితాదుల గ్రంధములను గూడ ఖండింపఁ గలుగునా !

గురు— ఇతని విట్టివనేకములు గలవు.

శ్లో. నిర్మాణేయది మార్మికోసి నితరా మత్యంతపాకద్రవ
న్మృద్వీకా మధుమాధురీమద పరీహారోద్ధురాణాం గిరాం,
కావ్యం తర్హి సఖే సుఖేన కథయ త్వం మావృశాం సమ్ముఖే
నోచే ద్దుష్కృతమాత్మనా కృతమివస్వాంతా ద్బహిర్మాకృథాః॥

శిష్య— అవును పుట్టినది మొదలు చేయుపాపములలోఁ దప్పుడు కవిత్వము చెప్పుటకూడ నొకపాపమేయనుకొమ్మని కుకవులకు బుద్ధిచెప్పి నాఁడు. కావుననే

శ్లో॥ తదల్ప మపి నోపేక్ష్యం, కావ్యే దుష్టం కథంచన,
స్యాద్వపు స్సుందరమపి శ్విత్రే ణైకేన దుర్భగం॥

అని దండి వ్రాకుచ్చె.

గురు— దండినాఁటికిస్వల్పదోషములను గూడఁగవిత్వమున సహించు నాచారము లేదు గాని యిటీవల వాణి రసయుక్తమైనచోఁ గొంతవఱకు దోషములున్నను సహింప వచ్చు నను నాచార మొకటి బయలు దేఱినది. ఏమంటివా ! దేశభాషలలోఁ గూడఁ గవిత్వము చెప్పుట యతిశయించిన కాలఁదిని పండితులు గానివారు కూడఁ గవు లగుట తటస్థించుచు వచ్చెను. అందులో గొందఱు మనోహర మగువాణి కలవారు గూడ నుంటచే వారి నవలకుఁ ద్రోయుటకన్న నందు రసమాత్రగ్రహణ మొనరించుట చేత నే తనియవలసివచ్చుచున్నది.

శిష్యు— చిత్తము. ఏదేనియు దేశకాలాదులను బట్టి మాఱుచుండును. ఒకమనవి. మహాకవి కాళిదాసు మాత్రము తన్నుగూర్చి యెందును జెప్పి కొన్నట్లు లేదు సుఁడీ !

గురు— ఓయివెఱ్ఱివాఁడా ! అతఁడును జెప్పికొన్నాఁడు చూడుము, శాకుంతలములో "అభిరూపభూయిష్ఠాపరిష దియం అద్యఖలు కాళిదాసగ్రథితవస్తునా నవేన నాటకే నోపస్థాతవ్యం" అని వ్రాసి యున్నాఁడు. ఈ సభ తెలివిగలవారిచే నిండియున్నది. కాన నియ్యెడఁ గాళిదాసునాటక మాడవలెఁ గాని యితరులనాటకము పనికిరాదఁట. దీనిచే నతని ప్రాగల్భ్యమును జెప్పి కొన్నట్లు తేలుట లేదా !

శిష్యు— చిత్తము. అమ్మహాకవి కవిజనమూర్ధన్యుఁడు గానఁ గడు సుళువుగా నాత్మశక్తిప్రకటన మొనర్చి కొన్నాఁడు.

గురు— భవభూతిమహాకవి—

శ్లో. హఠా దాకృష్టానాం కతిపయపదానాం రచయితా.
జనస్స్పర్ధాళు శ్చేదహహ! కవినా వశ్యవచసా,

ఘవే వద్యశ్లోకా కిమిహ బహునా పాపిని కలౌ
ఘటానాం నిర్మాతుస్త్రిభువన విధాతుశ్చ కలహః॥

అని విక్రమించినాఁడు.

శిష్యు— అవును. సమర్థుఁడైన కవితో నసమర్థు డెవఁడు నట్టి బ్రహ్మదేవునితోఁ గుమ్మరివాఁ డెవఁడో నుటవంటిదే,

శ్లో॥ నాస్మాకం శిబికా నకాఽపికటకా ద్యాలంక్రియా సత్క్రియా
నోత్తుంగ స్తురగో న కశ్చిదనుగో నైవాంబరం సుందరం
కింతు క్ష్మాతలవర్త్య శేషవిదుషాం సాహిత్యవిద్యాజుషాం
చేతస్తోషకరీ శిరోనతికరీ విద్యా నవద్యాఽస్తి నః॥

అనిచెప్పినమహాకవి యీతఁడేకాఁడు!

గురు— అవును. ఇంకను నితని విట్టి వనేకములు కలవు. ఒక్కొక్కరికి నొక్కొక్క శ్లోకము మాత్రమే యుదాహరించినను బెక్కులు కాఁగలవు. కానఁ బహుచుగా నొక్కొక్కటి మాత్రముదాహరింపఁబడెడివి. ఈ రఘునాథభట్టుప్రతిజ్ఞవినుము :

శ్లో. విదుషాం నివహై రిహైకమత్యా
ద్యదదుష్టం నిరటంకి యచ్చదుష్టం,
మయి జల్పతి కల్పనాధినాథే
రఘునాథే, మనుతాంత దన్యథైవ॥

శిష్యు— ఈయనఘుఁడు తర్కశాస్త్రములో చింతామణి గ్రంథమును రచించినశూరవరుఁడు కాఁడు! "లోకమున నుండు విద్వాంసు లెల్ల నొక్కటైపేది యవు నన్ననది కా దని సమర్థింపఁ దగువాఁ డని యితనిగ్రంథము చదువుకొన్నప్రాజ్ఞు లితనిని నుతించుచునే యుందురు. ఇట్టివారు పెక్కులు గలరు "విస్సన్న చెప్పినది వేద ' మను సామెతకుఁ గారణుఁ డగువిశ్వపతి శాస్త్రులవారు మొన్నటివారేకారా!

గురు— ఎవరేని భీష్మాదులవలె సమర్థులైనమొదలనే వారిప్రతిజ్ఞలు ప్రేనులకు వింద గొల్పుచు నాచంద్రతారార్కముగా విలసిల్లునే కాని భ్రష్టు శ్రేనరెంచు నుత్తరకుమారప్రజ్ఞలు తాటాకు దడులవలె వెనువెంటనే పడి పోవుచుండును. మహాదేవకవిప్రతిజ్ఞను వింటివా!

శ్లో. సారాసారవివేచనం విదధతే శబ్దార్థశాస్త్రేషుయే
యేచ వ్యాకరణేషు శిక్షితధియ శ్ఛందోవిచిత్యామపి,
యేఽలంకారనిబంధ నేషుబహుశో యత్నేన దత్తాశయా
వీక్షంతాం కవిమండలేశ్వరమహాదేవస్య తేవైఖరీం॥

శిష్యు— చిత్తము. సర్వశాస్త్రపారంగతుఁడు కావుననే యీకవికిఁ గవిమండలేశ్వరుఁ డనుబిరుదు నప్పటి వా రెల్ల నొప్పి యుందురు. లేనిచో వెనువెంబడిని నీ కీబిరుదు చెల్ల దని యెవరో ఖండించియే యుందురు, ఈ యనప్రతిజ్ఞకును మల్లినాథసూరిప్రతిజ్ఞకును బోలిక కన్పట్టుచున్నది సుఁడీ!

శ్లో. వాణీం కాణభుజీ మజీగణ దవాసాసీచ్చవై యాసికీ
మంత స్తంత్రమరం స్తపన్నగగవీగుం ఫేషుచాజాగరీత్,
వాచా మాచకల ద్రహస్యమఖిలంయ చ్చాక్షపాదస్ఫురాం
లోకేఽభూద్యదు పజ్ఞమేవ విదుషాం సౌజన్య జన్యంయశః॥

గురు— మల్లినాథసూరి దింకొకశ్లోకము కలదు.

శ్లో. యే శబ్దార్థపరీక్షణప్రణయినో, యేవా గుణాలం క్రియా
శిక్షాకాతు కినో విహర్తుమనసో యేచ ధ్వనే రధ్వని.
శుభ్యద్భావతరంగితే రససుధా సింధౌ మి మంక్షంతి యే
తేషామేవ కృతే కరోమి వివృతిం మాఘస్య సర్వంకషామ్"

ఈ శ్లోకమునకును దానికిఁ బూర్తిగాఁ బోలిక కలదు. మహాదేవకవి శ్లోక మింకొక్కటి గూడ వినుము.

శ్లో. దిక్చక్రం కియదండభిత్తిభి రిదం నన్వావృతం సర్వతో
ప్యండంనామ కియత్త్రి విక్రమపదైః రాకాంత మేతత్త్రిభిః,

తన్నిర్యంత్రిణ బాలకృష్ణభగవత్పాదప్రసాదోన్మిష
త్ప్రౌఢిమ్నః కవిమండలేశ్వర యశోగుంఫః స్వహా జృంభతాం॥

శిష్యు— ఓహో! మేమి యీకవికిఁ దనకవి తాసతియందుఁ గలవిశ్వా సాతిశయము. సత్కవిత్వమును సత్కళత్రమును దెప్పుయశమునకు బ్రహ్మండ మిఱుకగు ననుట యతిశయోక్తి కానేకాదు శ్రీరామున కంత యశస్సు సీతవలననే కదా! సంఘటించినది.

గురు— ఈశ్రీహర్షుని ప్రాభవము చూడుము.

శ్లో. తాంబూలద్వయ మాసనంచ లభతే యఃకాన్యకుబ్జేశ్వరాత్
యస్సాక్షాత్కురుతే సమాధిషు పరం బ్రహ్మ ప్రమోదార్ణవం,
యత్కావ్యం మధువర్షి; ధర్షితపరాస్తర్కేషు యస్యోక్తయ
శ్శ్రీ శ్రీహర్షకవేః కృతిః కృతిముదే తస్యాభ్యుదీయాదియం॥

శిష్యు— ఆకాన్యకుబ్జేశ్వరుఁడు తక్కిన పండితులకన్న నీమహా కవి నట్లు విశేషించి పృథగాసనదానాదికమున గౌరవించె ననుటచే నతఁడు గూడ సారాసార వివేచనగలమహారాజుగాఁ దోఁచుచున్నాఁడు. కావుననే పండితరాయలు

శ్లో॥ నృపత్వే పాండిత్యం పరభృతముఖే మానుషవచః॥
అని వాక్రుచ్చె.

గురు— ఈగోవిందకవియు నింతవాఁడేసుమీ!

శ్లో॥ జ్యేష్ఠే సర్వగుణైః కనీయసి వయోమాత్రేణ పాత్రే ధియాం
గాత్రేణ స్మరగర్వ ఖర్వణపరే నిష్ఠాప్రతిష్ఠాశ్రయే,
శ్రీహర్షేత్రిదివం గతే మయి మనోహీనేచక శ్శోధయే
దత్రాశుద్ధ మహో మహత్సు విధినా భారోఽయ మారోపితః॥

శిష్యు— కవితాధారం బట్టి చూడ నిజముగా నితఁ డాతని కన్నయే యనితోఁచుచున్నది. అయినను దనజీవితకాలమునఁ దమ్ముడుఁ చనిపోయిన విచారముచే నతనియందుఁ గల ప్రేమాతిశయము సూచించుచు వయో

మాత్రిముచేతనే తనకన్నఁ జిన్నవాఁడు కాని విద్యాధికమున నతఁడే పెద్ద యని వాకుచ్చినాఁడు. అవురా! ఇట్టికవిద్వయమునకుఁ దల్లిదండ్రులైన మా మల్లదేవీశ్రీహీరు లెంతసుకృత వంతులోకదా!

గురు॥ నీవనుకొన్నట్లువీరిరువురును నన్నదమ్ములుగారు. ఈశ్రీహ ర్షుఁడువేఱు. కానిమ్ము ఈరాజశేఖర మహాకవిధైర్యస్థైర్యములు చూచితివా!

శ్లో. బ్రహ్మాభ్యశ్శివ మస్తు వస్తు వితతం కించి ద్వయం బ్రూమహే
హేసంతశ్శృణు తావద త్తవిధృతో యుష్మాసు సేవాంజలిః,
యద్వా కింవినయో క్తిభిర్మమగిరాం య ద్యస్తి సూక్తామృతం
మాద్య న్తి స్వయమేవ త త్సుమనసో యాచ్ఞా పరం దైన్యభూః॥

శిష్యు— ఇతఁ డిట్టివాఁడుకనుకనే తాత్కాలికులగు విద్వత్కవులితని నిట్లు వర్ణించి యున్నారు.

శ్లో. పాతుంశ్రోత్రరసాయనం రచయితుం వాచ స్సతాం సమ్మతాం
వ్యుత్పత్తిం పరమా మవాప్తు మవధిం లబ్ధుంరసస్రోతసః,
భోక్తుం స్వాదుఫలం చ జీవితతరో ర్యద్య స్తి తే కౌతుకం
త ద్భ్రాత శ్శృణురాజశేఖరకవేస్సూ క్తీ స్సుధాస్యందినీః॥

గురు— విశ్వేశ్వర పండితుని విక్రాంతిం దిలకింపుము.

శ్లో. వైధేయై ర్యది కించి దత్ర రభసా దుర్వ్యాహృతే దూషణం
తే నాధాతు రపారమార్థికతయా కాచి న్నశక్యా క్షతిః,
విద్వద్భిః పునరుచ్యతేయది చ త త్స్యాత్తేన శోభాపరా
సంతాపోఽపివిభావయ త్యతిశయం కార్తస్వరస్యానలే॥

శిష్యు— తనకవిత్వము బంగారమువంటి దని స్వయముగ సూచించి నాఁడు. ఇట్లే యప్రాజ్ఞులుగూడఁ జెప్ప మొదలిడినచో నెవరు సమ్మతింతురు? తననెత్తిపై ముషిణిపండ్ల గంపను బెట్టికొని మామిడి పండ్లని కేక వేసినంత లోకులు గుఱితింపక పోవుదురా!

గురు— కవిరాజపండితుని యహంకారముం దిలకింపుము.

శ్లో॥ సుబంధుర్బాణభట్టశ్చ కవిరాజఇతిత్రియః
వక్రోక్తి మార్గనిపుణా శ్చతుర్థో విద్యతే నవా॥

శిష్యు— ఇది యహంభావ మెట్లగును? తానుగాక మఱియెవ్వరికి వక్రోక్తిమార్గనైపుణ్యమునఁ జోటిచ్చి యున్నాఁడుకదా!

గురు— అట్లన్నని వానిఁ జెప్పుమందువా:

శ్లో॥ హేగోదావరి! దేవి! తావకతటోద్దేశేకళింగః కవి
ర్వాగ్దేవీం బహుదేశవర్ణనసఖీం త్యక్త్వా విరక్తింగతః,
ఏనా మర్ణవమధ్యసుప్త మురజిన్నాభీసరోజాసనం
బ్రహ్మాణం గమయ, క్షితౌ కథ మసా వేకాకినీ స్థాస్యతి॥

శిష్యు— ఔరా! ఈకళింగకవిపై యాత్యము! తాను వీడినచోఁ బ్రపంచమున సరస్వతిని భరింపఁదగిన వాఁడే లేఁడుగా! కూపకూర్మము వంటివాఁడు చెప్పినమాట కనుకనా! కాదని త్రోసివేయుటకు; బహుదేశములను దిరిగితుదకు సన్యసించు పట్టునఁ జెప్పిన యీ దట్టుని మాటచెట్ట యనవెవఁడు సహకట్టఁగలఁడు! ప్రపంచమున నెట్టి యసహాయశూరులేని లేకపోలేదు. తెలియనిమూర్ఖులిట్టిశ్రేష్ఠులనెల్ల భ్రష్టు లనిన నెవఁడు సహించును?

గురు— సహించినను సహించక పోయినను వారి మూర్ఖత్వమును నిల్పుకొనుటకు వారు ప్రయత్నించుట తప్పదు కదా! దానికేమి! యీహరిహరకవి సామర్థ్యమున్ బరికింపుము!

శ్లో. వాగ్దేవీకరకంజపంజరపఠ త్కీరాయితానాం పురో
గణ్యంతే కవయః క్వ వాఙ్మయపురప్రాకారకాకాయితాః
బ్రహ్మస్వాదసుఖావ ఘాతమనసాం గోష్ఠీషు సాంసారికా
స్స్వర్గోత్సంగని షాదినోఽపి కురరీపాకా వరాకాఇవ॥

శిష్యు— అవును. మహాకవులకు సరస్వతీదేవిముంజేతి చిలుకతోడను కుకవులకుఁ బ్రాకారకాకముతోడను నుపమానము రమణీయముగాఁ గుదిర్చినాఁడు. ఇట్టిది పండితరాజశ్లోక మొకటిగలదు.

శ్లో. పీలాలుంఠితశారదాపురమహాసంపద్భరాణాం పురో
విద్యాసద్మవినిర్గళత్కణముషో వల్గంతి చే త్స్వైరాః
అద్య శ్వః ఫణినాం శకుంతశిశవో దంతావళానాం శశా
స్సింహానాంచ సుఖేన మూర్ధని పదం న్యస్యంతి సాలావృకాః॥

గురు—ఈశ్లోకద్వయమును మున్నుదాహరించిన "హాలాదాకృష్టానాం" అనుశ్లోకమును భంగ్యంతరముగా నొకటే విషయమును బోధించుచున్నవి. కుకవులు సుకవుల నెదిరించుట బ్రహ్మతోఁ గుంభకారుఁడెదుర్చుటవంటి దియుఁ జిలుకలతోఁ గాకులు సామ్యమభిలషించుటవంటిదియు సర్పములపైఁ జిన్నిపక్షులు కాలు ద్రివ్వుటవంటిదియు నేనుఁగులతోఁ జెవులపిల్లు లెకసక్కె మాడుటవంటిదియు సింహములతోఁ గుక్కలో నక్కలో క్రోఁతులో లేక యాత్రితయమునో కోడిగ మాడుటవంటిదియు నని పైశ్లోకత్రియమునకు ముఖ్యతాత్పర్యము. ఇట్లనేకమహాకవులు చెవి నిల్లుగట్టుకొని పోరుచున్నను గుకవులు తమతెల్వితక్కువను వదలఁజాలకుండుటకుఁ గత మేమో! యని విచారింపఁగా "శ్లో. జ్ఞానలవదుర్విదగ్ధం బ్రహ్మాపి నరం నరంజయతి" యను భర్తృహరివాక్యము తప్ప మఱియొండు శరణముగాన రాకున్నయది కానిమ్ము. శంభుకవివాక్ప్రౌఢిమ నవలోకింపుము:

శ్లో. పీయూషద్రవహారిణీ సుమనసాం ఘ్రాణాన్యవిస్తారిణీ
త్వత్త్రేవాభిరవాపికాఽ ప్యభినవావాగ్దేవతేభారతీ,
అస్త్యేకాతు కృతాంజలే ర్జనని మే శంభో రియం ప్రార్థనా
మద్వాచాం క్వచిదస్తు వస్తునిపుణ శ్శ్రోతా సచేతా జనః॥

శిష్యు— అవును. చక్కనికవనము చెప్పువానికిఁ దగిన సహృదయుఁ డుండకపోయినచో "అరసికుండైననరపతినాశ్రియించి, కృతులొనర్చెడి కవినెత్తిగీఁతరోఁత" యనుట తార్కాణమగునుగదా! కావుననే భవభూతి

శ్లో. యే నామ కేచి దిహ నః ప్రథయం త్యవజ్ఞాం
జానంతి తే కిమపి తా న్ప్రతినైషయత్నః.

ఉత్పత్స్యతే మమను కోఽపి సమానధర్మా
కాలో హ్యాయంనిరవధి ర్విపులాచ పృథ్వీ.

అనివ్రాసికుచ్చినాఁడు.

గురు— అవును !

శ్లో. శిశు ర్వేత్తి పశు ర్వేత్తి వేత్తి గానరసం ఫణీ,
కోవేత్తి కవితాతత్త్వ మీశ్వరోవేత్తివా నవా॥

మహాకవులకవిత్త్వమహాత్త్యము మహాకవులకే తెలియఁదగు, కావ్య మనే జగత్సృష్టిలో సక్కఁదక్కఁదఁగొందఱు మహాకవు లగురాజులం గూడ భగవంతుఁడు పుట్టించి యున్నాఁడు. ఈక్రిందిశ్లోకమొక మహారాజు చెప్పినదియే.

శ్లో. యత్తీక్ష్ణక్షతధారదుర్ధరమహాకౌక్షేయకాక్షేపణ
క్షుభ్యత్క్ష్మాపతివల్లభోచ రదరీ నిర్భిన్న గర్భాయతే
సోఽయందుర్జయదోర్భుజంగ జనితప్రౌఢప్రతాపానల
జ్వాలాజాలఖిలీకృతారినగర శ్రీనాగరాజో జయీ॥

శిష్య— ఇమ్మహాకవి తనగ్రంథాంతమునఁ దనకవితాశూరతనుజెప్పక వాహుబలమును వర్ణించుటకు హేతువేమో !

శిష్య— హేతువున కేమున్నది. కవిత్వ మెట్టిదియో ధారవలననే తెలునుగదా ! యనితనజాతికిఁ బ్రధానమగు గుణముఁ గూర్చి చెప్పి కొనియున్నాఁడు. విద్యానాథకవి పౌఢిమను దిలకింపుము,

శ్లో. మాత ర్భారతి, వత్సకిం, తవకృపాం యాచేఽద్య, కింప్రస్తుతం,
జిహ్వే కాకతివీరరుద్రనృపతే స్తోత్రాయ సన్నహ్యతి,
జ్ఞాతం తే విహరంతు వాగ్గహరయ స్సంధ్యానటద్ధూర్జటి
త్వంగన్మౌళి తరంగిణీకలకలారంభప్రియంభావుకాః॥

శిష్య— ఇయ్యనఘ కవిత్వము తనకును బ్రభువునకును గూడ గౌర వాపాదక మగుచున్నది. కావుననే

శ్లో. మణినా వలయం వలయేన మణి ర్మణినా వలయేన విభాతి కరః
కవినాచ విభు ర్విభునాచ కవిః కవినా విభునాచ విభాతి సభా॥

అని పెద్దలు చెప్పుదురు.

క. నేరనికవికవితాఖర, వారారోహణమహోత్సవంబున కన్నన్,
నేయచుకవికవితార్ణవ. దో రూదారపరిహారయోగము మెఱుఁగొ.

గురు— అవును "వరం విరోధోఽపి మహాత్మభి స్సమం" అది యటు లుంచి యీవేంకటాధ్వరికవి పాండిత్యపరిశంస నాకర్ణింపుము.

శ్లో. వ్యాయామం గమితాత్వలంకృతిపథే వ్యాపారితా వ్యాకృతౌ
తర్కారణ్య గతాగతై శ్శ్రమవతీ తంత్రాంగణే వర్తితా,
త్రియ్యద్రే రధిరోపితాచ శిఖరం త్వ్వాదియం భారతీ
గంభీరం గజభూధరేశ్వరకథాగంగాఝరం గాహతే॥

శిష్య— చిత్త మిమ్మహాకవి కిన్నిశాస్త్రములును వేదమును వచ్చి నందుల కీతనిగ్రంథములు సాక్ష్య మిచ్చుచుండును. ఈశ్లేషయమకచక్రవర్తి యసదృశుఁ డనినఁ దప్పు కాదు. ఇదేతీరున ధర్మాభట్టు చెప్పిన వొకటికలదు.

శ్లో. యేన స్వైర మఘాణి పాణినిమతం ప్రాణాది కాణాదవా
గ్గుంఫే స్పష్ట మఘట్టిభట్టగురు వాగుట్టీకితే కుట్టిమే,
నిశ్శంకం విరటంకి శంకరమతం చాక్షోది చాక్షోంఘ్రివా
గ్ధ్వన్యధ్వ న్యదలా న్యఖండి నిఖిలా పాషండషండాటవీ॥

గురు— అవును. పైశ్లోకముకన్న నిది కఠినశైలిలోనున్నను రెంటికిని బోలిక పూర్తిగాఁగలదు. ఈయనఘుని కవిత్వ మారభటికిఁబెట్టినదిపేరు. ఈశ్లోకము చూడుము.

శ్లో. ఆటోపోద్భటనాట్యధూర్జటి జటాకోటీరకోటీనట
ద్గంగాతుంగతరంగరింగణభరపరిస్పర్ధివాగ్వైభవః

సోఽయం ధర్మసుధీర్గవాం విలసితైః కష్టం రసాలం క్రియా
సంప్రాప్తిం సముదంచయేయ మధునా సాహిత్యరత్నాకరం॥

శిష్య— చిత్రము, రత్నాకరమనుటచే జ్ఞప్తికి వచ్చినది. రత్నాకరుఁడనునొకకవి గలఁ డనియు నతఁడు కడు గొప్పవాఁ డనియు వింటిని. అమ్మహామహుని ప్రశస్తిం గూర్చి సెలవిండు.

గురు— ఆయనఘుఁడే గ్రంథాంతమున నిట్లు వ్రాసికొని యున్నాఁడు.

శ్లో. హరవిజయమహాకవేః ప్రతిజ్ఞాం
శృణుత కృతప్రణయో మమప్రబంధే.
అపిశిశు రకవిః కవిః ప్రభావా
ద్భవతి కవిశ్చ మహాకవిః క్రమేణ.

శ్లో. యస్యోదయేంధతమసం ఒదహతో విశుద్ధి
రావిర్భవ త్యనిశమేవజలాశయానాం,
తం గ్రస్తవాఙ్మయ సముద్ర మవేహి రాజ
రత్నాకరం రవి మథైన మగస్త్య మౌర్వం॥

శిష్య— ఒకరికన్న నొక రసాధ్యులు. ఇతనినేర్పునెల్లఁ దనరత్నాకరత్వము సార్థక పఱచుటయందే చూపినాఁడు. పైపెచ్చు తన్ను నగస్త్యునితో నౌర్వునితోఁ బోల్చికొనుటలోఁగనుపఱచినపాండిత్య మనుపమముగానున్నది.

గురు— మఱియుననీలకంఠదీక్షితుని శ్లోకము వినుము.

శ్లో. సాహిత్యం నహి జానతే కతిపయే శాస్త్రైకనిష్ఠా యది
క్షంతవ్యం విదుషా మిదం క్వను పున స్సర్వత్ర సర్వజ్ఞతా,
ఉత్పన్నాః కిల ధూమకేతవఇవ క్లిశ్యంతి యత్సాహితీం
దుర్వైదగ్ధ్యలవేన కేచిదిహ తద్దుః ఖాయ విద్యావతాం॥

శిష్య— సంశయ మేమి! తోఁకచుక్కలవలె జ్ఞానలవ దుర్విదగ్ధులు సాహితీసామ్రాజ్యనాశసూచకులై సర్వజ్ఞత్వమును నటించుట విజ్ఞులకు,

ఖరితాపకరముగాదా! పైపెచ్చు వీరికట్టిమహామహులెల్ల భ్రష్టులనియుఁ దామత్కృష్టుల మనియు నభిప్రాయము.

గురు— అట్టి శిరోభారమువలన నేమి లాభము!

శా. భ్రష్టం దేదియొ పెట్టి పట్టి తన ప్రభ్రష్టత్వముఁ వీడను
త్కృష్టాత్మన్ బదివేలసారు లెటులో ధిక్కారహిక్కారుతిఁ
భ్రష్టుం డంచు వచింప నేమి యగు! స్వభ్రష్టత్వ మల్లంత ను
త్కృష్టుంజేరెడి నే! తమస్సమితి నీరేజాప్తు వెన్నంటునే!

శిష్య— చిత్తము. భారతవీరులప్రతిజ్ఞలు గొన్ని దెలుపఁగోరెదను.

గురు— వినుము.

శ్లో. న తం పశ్యామి కౌంతేయ యో మాం యుధ్యన్త మాహవే,
విజయేత పుమాన్ కశ్చి దపి సాక్షా చ్ఛతక్రతుః

అని భీష్మలును

శ్లో. న శత్రుం తాత పశ్యామి యో మాం హన్యా ద్రణేస్థితం
యుధ్యమానం సుసంరబ్ధం శరవ ర్షౌఘవర్షిణం
ఋతే ప్రాయగతం రాజన్ న్య స్తశస్త్ర మచేతనం
హన్యా న్మాం యుధి యో వీర స్తత్య మేత ద్బ్రవీమితే॥

అని ద్రోణాచార్యులును

శ్లో. అవధ్యోఽహం మహారాజ యుధ్యస్వ జయ మాప్నుహి

అని కృపాచార్యులును

శ్లో. న చాపి మమ పర్యాప్తా స్సహితా స్సర్వపార్థివాః,
క్రుద్ధస్య సంయుగేస్థాతుంసింహస్యే వేతరే మృగాః

అని శ్రీకృష్ణులును

శ్లో. భవాఙ సమర్థస్తాన్ సర్వాన్ నిహంతుం నాఽత్ర సంశయః
నిహంతు మహ మప్యేక స్సమర్థః పురుషర్షభ

అనియద్దనుచుఁను స్వోత్కర్షమును సమయోచితముగాఁ బ్రకటించు కొన్నారు. ఇందులోఁబామే యుత్కృష్టులమని కొందఱును దాము త్కృష్టులమని మఱికొందఱును జెప్పుకొనియున్నారు. అప్పకవి యీయం శము నెఱుఁగని వాఁడు కాఁడు.

శిష్యు— చిత్తము. అతని యభిప్రాయ మెఱిఁగిన వారప్పకవి పద్యముల నుచితస్థలముననే యుపయోగింతురు. తెలియనివారు "కుర్కుత్ర బుడసోమయోః" అన్నట్లు వాడికొందురు.

గురు— ఈకాంచనకవివాగ్గరిమచూడుము.

శ్లో. తత్సూనుః కాంచనోనామ సమస్తగుణవల్లభః
గోష్ఠిశాలేవ విద్యానాం యస్యజిహ్వా విరాజతే॥

శ్లో. విశ్వనాథఇతిఖ్యాతః కవిరస్తియదుక్తయః.
అకాంచనమరత్నం చ విదుషాం కర్ణభూషణం॥

శ్లో. వాచస్తస్య కవేరుదారమధురా ఇత్యత్రచిత్రం కిము
ప్రఖ్యాత స్సకలాసు దిక్షు గుణిషు శ్రేయా నగస్త్య స్సుధీః
వేధశ్చందమ్రుఖీక రాంగుళిదళాసంగ క్వణద్వల్లకీ
వాచోయుక్తిసహోక్తిదర్శిత సుధాజన్మాన యన్మాతులః॥

శిష్యు— ఎందఱేని మహానుభావులు గీర్వాణకవులలోనే యుండ వచ్చును. ప్రకృతవిషయ మప్పకవినిగూర్చినదిగావున నతఁడాంధ్ర కవి యగుటచే నాంధ్రకవుల ప్రతిజ్ఞా వాక్యములు గొన్ని పెలవీఁగోరెదను.

గురు— ఈశ్లోకమొకటియు వినిచి నీ కోరినట్లే చేసెదను.

శ్లో. ఇద్ధంసత్కవిరాజరాజిమకుటాలంకార హీరాయిత
శ్రీహీరాత్మభవేన నైషధమహాకావ్యోజ్జ్వలత్కీర్తినా,
ఉద్వృత్త ప్రతివాది మస్తకతటీ విన్యస్తవామాంఘ్రిణా
శ్రీహర్షేణ కృతం చిరం విజయతాం శ్రీకోశరత్నం మహత్॥

శిష్యు— ఈశ్రీహర్షునికీ "యువ్వృత్త" విశేషణమిచ్చు కయు నతిశయోక్తికాదు. ఇతఁడుసర్వమతములను ఖండించి యద్వైతమును సిద్ధాంతీకరించినయంతర్వాణి పంచాస్యుఁడుకదా!

శిష్యు— బిల్హణకవిం గూర్చి సుంతయుఁ జెప్పకున్నారైతిరేమి.

గురు— అవును మఱచితిని. కాక యిప్పు డనేనెవరిని గూర్చి చెప్పితిని. ఆవగింజలోనాఱవ వంతైన కాలేదు. విక్రమాంక దేవచరిత్రలో నమ్మహామహుండు పదునెన్మిదవ సర్గమునఁ దన్నుంగూర్చి, వ్రాసికొన్న యంశమును సంగ్రహముగాఁ దెలుఁగునం జెప్పెద నాలింపుము.

( బిల్హణ చరిత్ర )

సర్వవిధముల సుప్రసిద్ధంబగు కాశ్మీరదేశమ్మున మిక్కిలి వన్నెవాసి గలిగి చెన్నుమీఱెడు ప్రవరపుర మను నొకపట్టణముకలదు. ఆపురము నకు రెండుక్రోసుల దూరమున జయవనమను నొకవనముగలదు. అది కడుఁ బావనమును రమ్యమునునై యొప్పారు. ఆవనసమీపమున "ఖోనముఖ" మను నొకయూరుకలదు. దానినెంతవర్ణించినను దనివితీరదు. అందనేకులు సద్బ్రాహ్మణులుకలరు. వారిలో గౌతమగోత్రోద్భవమగు నొకతెగవిప్రశాఖ సొబగొందు, శ్రీ కాశ్మీరదేశాధిపతి యగు గోపాదిత్యక్షితిపాలుఁ డీగౌతమ గోత్రులకప్పించి తనజన్మమును బావనముగా నొనరించికొనియె. ఈగౌతమగోత్రులకు ముక్తికలశుఁ డనుమహాత్ముఁడు కూటస్థుఁడు. చతుర్వేదములును నితఁడుసాంగముగాఁ బఠించి యాచరణములోనికిఁ దెచ్చినవాఁడు. మహాదాతయుఁ బరాక్రమధనుండును మహాపండితుఁడు నగురాజకలశుండాతనికొడుకు. ఈయనపుత్రుఁ డనేక క్రతువిధాతయు, శాస్త్రవ్యాఖ్యాతయు నై విలసిల్లె. సర్వవిధములఁ దండ్రినిమించెడి జ్యేష్ఠకల శుండమ్మహామహుని తనూజుండు. ఈతఁడే మహాభాష్యమునకు వ్యాఖ్యాన మొనర్చినమహావైయాకరణశిరోమణి. పరమపతివ్రతాశిరోవతంసమగు నాగా దేవి యీయనఘుని యర్ధాంగలక్ష్మి. ఈపవిత్రదంపతుల కేనుగొమరుండ.

ఏనుగవిశేఖరుండనేకాక మిగులఁజక్కఁదనము గూడఁగలవాఁడనని లోకులచేమెప్పు నొందినవాఁడ. మౌంజీబంధమునాఁటనుండియు నానోట వాగ్దేవత నివసించియేయున్నది. షడంగసహితమగు వేదము నేను గురుశుశ్రూషచేసి చదువుకొంటిని. పాతంజల మహాభాష్యము పూర్తిగా శాంతిచేసితి. సాహిత్యవిద్య నాకుఁ బ్రాణమే. ఇది, యది యని పరిగణింపనేటికి; యథార్థమాలకింపుఁడు; విమలంబగు నాప్రతిభాదర్శమ్మునఁ బ్రతిఫలింపనివిద్యయేలేదు. నామొగమువంకఁ బులుకుపులుకునఁ జూచు విద్యావధువుల నందఱిం జేపట్టితిని. వాగ్దేవికర్ణపూర రజోభరంబునాపైఁ జిలికెంచినది. నాకావ్యములువేత్రధరులై ముందునడువ నాకీర్తికాంతనిరుపప్లవమ్ముగా సర్వదిగ్యాత్ర కావించినది. పాండిత్యపర్వతమునకు శిఖరమైన నాపెద్దయన్న ఇయిష్ట రాముఁడు పెక్కుమందియొడయల పేరోలగమ్ములకు నగయైవర్ధిల్లె. అతనివర్ణింప నాతరముగాదు. నాతమ్ముఁడానందుఁడు స్పర్ధకై యెదుర్కొను కవీంద్రులదుర్మదమును భేదించుటకు రీలాకుఠారమైన వాఁడు. వీఁడు నాకన్న మిన్నయైనను జ్యేష్ఠుఁడనగు నా కంతగా వర్ణనీయుఁడు గాకపోవుఁగాక. ఇట్టివిద్వద్వంశమునఁ బొడమిననేను, కాలక్రమాంతరమునఁ గాశ్మీరదేశమువదలి మథురాపురమునకువచ్చి ప్రతివాదులై యెదిరిన పండితమండనులనెల్ల జయించి బృందావనపురమ్మున కరిగి యటఁగొన్నాళ్ళు వసించియుండఁ బేరువిన్నంతమాత్రమునఁ బ్రతివాదులకు జ్వరమువచ్చునట్లునేయు నాశిష్యులే తమశాస్త్రవాదములకు దిగ్గజముల మదముడ్రావి ఝంఝుమ్మనిరొదసేయు గండుమమ్మెదలరొదలు మాత్రమె కొంచెమంతరాయముగలిగించునట్లు సర్వదిగంతజైత్రయాత్రగావించి యస్మదీయమగుకీర్తిని వ్యాపింపఁజేయసాగిరి. విద్వాంసుఁడుగాని మూర్ఖుఁడుగాని వృద్ధుఁడుగాని బాలుఁడుగాని యాఁడుదిగాని మగవాఁడుగాని యేగ్రామమందుఁగాని యేపల్లెయందుఁగాని యేరాజధానియందుఁగాని యేయరణ్యమందుఁగాని యేయుపవనమందుఁగాని యొడలుపులకరించునట్లు నాకావ్యములు చదువనివారులేరు. తరువాత గంగానదిందరించి "ముందా" పట్టణ

మున నాకీర్తింబ్రవహింపఁ జేసితిని. బవఁపడి యస్మదీయయశఃపరిమళము నాస్వాదించి కాన్యకుబ్జాధీశ్వరుఁడు సబహుమానమ్ముగా నాహ్వానింప నయ్యనఘునొద్దఁ గొన్నాళ్ళుండి పిమ్మటఁ గాశీక్షేత్రమ్మున కరిగి కుత్సితరాజ సందర్శన జనితం బగునఘమ్ముంబాసి శ్రీరామచంద్రునిజననమునఁ బవిత్రత కాకరమైన యయోధ్యకుఁ జని పవఁపడి భోజరాజమహాకవికి నివాసమై ప్రసిద్ధిచెందిన ధారానగరమున కేగి యటనుండి పశ్చిమసముద్రతీరమున కరిగి దేశాటన కుతూహలమ్మున నించుక చరించుచుఁ దుదకు సేతుసం దర్శనంబొనరించి పవిత్రుఁడనై నాకీర్తికాంత యాసేతుమార్గమున లంకా ద్వీపమునకరుగఁ గుతూహలపడినసుజననీక మెట్టకేలకు వెనుకకుమరలించి సామాన్యులును నప్రాజ్ఞులును నగునుర్వీపతుల యైశ్వర్యమునకు నభిల షింపక స్వదేశగమనోన్ముఖుండనగు తఱి చాళుక్యరాజదేవేంద్రుఁడు పిలి పించి సమ్మానించి నీలచ్ఛత్రగజఘటాములచే నారాధింప బిట్టుకొఁగి లించుకొనుటన్ జేసి గల్లు గల్లుమని మ్రోగుబాహువలయంబులు గలరాజ్య లక్ష్మిసౌఖ్య మనుభవించుచుంటి. నేనురచించిన యీయవ్యాజసుందరమగు కావ్యము.

( విక్రమాంకదేవచరిత్ర )

కర్ణాటభూపాలునికీర్తి నాచంద్రస్థాయిగ నొనర్చుచు విద్వాంసులకుఁ గర్ణాలంకారంబగుఁ గాక. ఐశ్వర్యమా ! లభించినది. సాధుభోగ్యములగు సంపదలా ! ప్రతిదిక్కునందును వెదఁజల్లితిని. సజ్జనులతో సహవాసము చేసితిని. ప్రతిభటకవికోటిని నిర్జించి జయలక్ష్మినార్జించితిని. నాకేదియుఁ గొదవలేదుగాని సారాసారవిచార దక్షమైన ప్రతిభాసామర్థ్యము కలిగి కొని యాడంబడు కాశ్మీరక సుజనసంఘముతో నాకచిరకాలమ్మున సహవాసము లభించుంగాత, మనిగోరుచున్నాఁడను. మహారాజులయనుగ్రహము సంపా దించితిని. సంపదలనుభవించితిని. కొంచెమో గొప్పయో చదువుకొంటిని. ఎందరినోకొందఱిఁ బ్రతిపక్షులజయించితి. ఇఁకనీయజ్ఞానమయం బగు

ప్రపంచముతో సంబంధము విడిచి దివ్యబోధనీయగలగంగాద్వారమున నెప్పుడు నివసింతునో, నాకంతటిభాగ్య మెన్నఁడుకలుగునోకదా : ఆగంగా తీరనివాసభాగ్యమెంతటిపుణ్యాత్ములకోగాని లభింపదు. కానిండు. ఓరాజులారా! సంపద లదృష్టమేఘమ్ములం దేజరిల్లుమెఱుంగులు. వానిని స్థిరముగానిల్పు టకుం దగినసామర్థ్య మెవ్వరికినిలేదు. ప్రాణప్రయాణపటహ మెడతెగక సర్వదా మ్రోఁగుచునే యుండును. కావ్యామృతముపోసి యశోమయ శరీరమునుండి మీప్రాణములు కాపాడఁ దగినవారు, సుకవీంద్రులుకాని యొరులుకారు, కావున వారల నారాధింపుఁడు. ఓనరేంద్రులారా ! సుకవి ప్రేమబంధమ్మున విరోధముం బూనకుఁడు. మీకువీరివలననే శుద్ధమగుకీర్తి లభింపఁగలదు. శ్రీరామునియందుఁ గవులకు దయగలుగుటంజేసియే యతనిచరిత్ర సచ్చరిత్రమైనది. దశాస్యునియెడలఁ గవయితలకుఁ గోపము కలుగుటచేతనే వాఁడు త్రిభువనజేత యయ్యు దుర్మార్గుఁడయ్యెను. శశాకారము దాల్చినవాఁడనుభయమ్మున నెవ్వానితలమీఁది చంద్రునిలోని కురంగము దూరముగాఁ బాఱిపోయెనో శ్రితులకాదికవియు నచలకన్యకకు బ్రియుండును నగు శ్రీశంకరుండు సుకవివచనరచనల యందాదరము కల్పించి యవితెలిసికొనుటకుం దగినవ్యుత్పత్తిని మీకొసంగుఁగాక"

శిష్యు— ఇతఁడు నిరాఘాటుఁడు, ఇట్టివాఁడు తుదకొక్కచో నెటు లుండెనా ! యని నాకు సందియము.

గురు— తుదకొక చోనుండిననేమి మండిననేమి ?

ఉ. కట్టి యశమ్ము దిక్కులను గాకవిలోకము పాఱఁదోలి పై
గిట్టుటయో యొకానొకటఁ గీడ్పడి యుండుటొ యొప్పుఁ గాక తాఁ
బుట్టకయే యనాథయయి పుట్టిన బాలవితంతుపోల్కి బల్
దట్టుబ నిల్తురే యొకట "తౌడొకరొట్టె"యె తానుమానిసే.

శిష్యు— ఈపద్య మీయనఘుని జీవితమును సంగ్రహముగాఁ జెప్పు

మాత్రముగాఁ గన్పట్టుచున్నది. మహాత్మా ! తెలుఁగులోనిట్టివారు కవులలోఁ గలరా !

గురు- ఇతనింజెప్పిచెప్పవలనుపడదుగాని, మహాసుభావులులేకపోలేదు.

శిష్య— వారిం గొందఱ వినఁగోరెద.

గురు— తెలుఁగులోనికబ్బము లన్నియు సుప్రసిద్ధములే. వారివారిప్రజ్ఞ లాయాపీఠికలంజూచికొనుము. స్వల్పముగానుదాహరించి విరమించుచున్నాఁడను.

శా. ఈక్షోణిన్నినుఁబోలుసత్కవులులేరీనాఁటికాలమ్మునన్
దాక్షారామపురీవిహారవరగంధర్వాప్సరోభామినీ
వక్షోజద్వయ కుంభికుంభఘుసృణస్వైరాజ్యభారమ్మున
ధ్యక్షింపన్ గవిసార్వభౌమ ! భవదీయప్రౌఢసాహిత్యముల్.

(శ్రీనాథుఁడు.)

మ. ఉదయంబస్తనగమ్ము సేతువు హిమవ్యూహమ్మునుం జుట్టిరా
విదితంబైనమహిన్ మహేంద్రకవితావిద్యాబల ప్రౌఢినీ
కెవరేరీ ! సరసార్థబోధ ఘటనాహేలాపరిష్కారశా
రద నీరూపము రామకృష్ణకవిచంద్రా ! సాంద్రకీర్తిశ్వరా.

(తెనాలిరామలింగకవి.)

మ. శతలేఖిన్యవధాన పద్యరచనాసంధానసుత్రాణచి
హ్నితనామా: జరికొండధర్మసుకవీ నీవాగ్విలాసంబులా
శితికంఠోజ్జ్వల జూటకోటరకుటీశీతాంశురేఖాసమ
న్వితగంగాకనకాబ్జనిర్భరరసావిర్భూతమాధుర్యముల్॥ (ధర్మకవి.)

ఇట్లేపలువురు నేఁడివి యాత్మశక్తినిబ్రకటించుకొని యున్నారని యెఱుఁగుము.

శిష్య— చిత్తము, అష్టకవిరాత్పర్యము నామదికి వచ్చినది. స్వతస్సిద్ధమగు శక్తిలేక యెట్లో పేరుసంపాదింపనెంచి తెరచాటుప్రయత్నము చేసినప్పుడు నుత్తరకుమారప్రజ్ఞలు పన్నెండియపాట్రిలకొఱ కావద్యము వ్రాయఁబడినదిగాని వేఱొకరినుద్దేశించి వ్రాయఁబడలేదు. నాకీసందియమును దీర్చినతమ కనేక నమస్కారము లొనర్చుకొనుచున్నాఁడను.

గురు- శ్లో. కృతంజానాసి విద్యార్థిన్! యశఅప్నుహి శాశ్వతం,
పూర్వోక్తాః కవయస్సర్వే దమ్యస్తే సర్వదా శుభం.

తిరుపతి వెంకటేశ్వరులు



శ్రీమత్పరదేవతాయై నమః

# అపూర్వకవితావివేచనము



శ్రీ

## తిరుపతి వేంకటేశ్వరకవులు

శతావధానులు.



ప్రకాశకులు :

చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి సన్సు,

వేంకటేశ్వర పబ్లికేషన్సు

కడియం P. O.

తూర్పు గోదావరి జిల్లా.

1955



# పీఠిక

ఆర్యులారా!

ఈ ప్రహసనమును మేము ప్రస్తుతకాలములోని కొందఱు పరిశీలకులం గూర్చి వ్రాయవలసి వ్రాసితిమి. దీని సారాంశమేమన నెటువంటివారి కవనమందును బురోభాగులకు దోషమే పొడకట్టు ననియు నొకవేళ దోసఁ గొకించుకయు వారక నిదో నప్పుడు చేసినదానినేని చెప్పిపెట్టుకొని యద్దానిచే నైన వారు సంతుష్టినొందుట తప్పదనియుఁ దెలిసికొనఁదగు.

మచిలీబందరు
1912

దివాకర్ల తిరుపతిశాస్త్రి
చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి
శతావధానులు

---

## ఇందువచ్చు పాత్రలు

| | | |
|---|---|---|
| వివేకిని | మృదులాంగి | మందగమన |
| పరిశుద్ధధార | నిరుపమ | మాలతి |
| పురోభాగిని | శృంగారవతి | సారంగి |
| రసజ్ఞురాలు | నవోఢ | చందనలత |
| కూలంకషకవనము | పరిహాసిని | రక్తాక్షి |
| సర్వజ్ఞ | విరాగిణి | చమత్కారిణి |
| నిరాఘాట | జయశీల | కల్పలత |
| నిర్దుష్ట | మలయవతి | గభీర |
| రసవతి | మనోజ్ఞ | ఉదార |
| వినోదిని | దుర్జయ | సుగీత |
| మంజుభాషిణి | పద్మిని | కళావతి |
| చంద్రిక | సదూహ | శాపిని |
| ఆశ్లేషిణి | కమలాక్షి | .... |
| ద్వ్యర్థకరి | సుమధ్య | .... |

శ్రీమత్పరదేవతాయైనమః

# అపూర్వకవితావివేచనము



( ప్రహసనము )

( కొందఱుకవితలు ప్రవేశించుచున్నారు. )

వివేకిని— ఓహోకవితలారా! ఇంతకాలమునకు మనమెల్లరము నొక్కయెడన్ గూడుట తటస్థించె. నేఁడుగదా సుదినము. మీమీరచనావిశేషమ్ము లన్నియు నొక్కపరి యిందర నానందమ్ము నొందించుట కన్న వేఱొకభాగ్యమ్మునుం గలుగునే. అన్యోన్య రచనాశ్రవణమ్ము నేఁటికిఁ జేకూరినది. ఏదీచూతము, స్థాలీపులాకన్యాయముగా మీమీ పద్యములు వినిపింపుఁడు.

పరిశుద్ధధార— ఇదుగో చదువుచున్నాను.

ఉ. ఆయము గర్వమున్ విడిచి యన్యపతుల్ పనిసేయ నిట్లు గాం
గేయభుజాశ్రమమ్మున నికృత్తవిరోధిసమాజుఁడై కుమా
రాయితశక్తిశాలి ధృతరాష్ట్రుఁడు రాజ్యము సేయుచుండె న
త్యాయితశక్తితోఁ దనకు హస్తిపుర మ్మది రాజధానిగాన్. 1

(భారతము)

వివే— ఆహా! ఏమి పాకముగానున్నది; కటుఁ జక్కనైనధార కవిత్వ మనఁగా నిట్లుండవలయును.

పురోభాగిని— (తనలో) ఈమె యేదివినినను, ఆహా యనుటయే కాని యందలిదోషములఁ బరికింపనేరదు. కానిమ్ము. (ప్రకాశముగా) నీకేమి

యానందము గలిగించెనో కాని నా కిందెన్నియో దోషములు పొడకట్టు చున్నవి. మరలం జదువు మనుము చూతము.

పరి— (తనలో) ఇవి నిర్దుష్టమే యని యనేకు లొప్పుకొనిరే. ఇందు దోసమెక్కడ నున్నదో. కానిమ్ము చదివెద. (అని మరలంజదువును)

వివే— ఇందులో దోసమెయ్యదనులేదే.

పురో— ముందిది యేభాషయో నాకుఁ దెలియరాకున్నయది.

పరి— (పరిహాసముగా) ఇదా నీసంశయము? తెలుఁగుబాస. ఇప్పుడు తెలిసినదా?

పురో— (గర్వముతో) అంతమాత్రమును దెలియనిదానను గాను. తెలుఁగే యైన నిన్నిసంస్కృతపదము లెందుకుండవలెను?

వివే— అదియేమి శంక? తత్సమము లుండఁ గూడదా?

పురో— తెలుఁగు కవిత్వమైనప్పు డింత జిగిబిగి పనికిరాదు. అట్లయిన సంస్కృతమే రచింపరాదా? కానిందు దీనికేమి. ఇందులో వ్యర్థపదము లెన్నియో యున్నవి. రాజులు గొల్చుచుండ ధృతరాష్ట్రుఁడు హస్తి పురము నేలుచుండెను. అనుట కింతసోది యెందుకు? అదిగాక చెప్పిన దేనియు నంతసందర్భముగా లేదు. గుడ్డివాఁ డగు ధృతరాష్ట్రునిఁ గుమారస్వామితో నెందుకుఁ బోల్పవలయును?

వివే— ఓహో! ఇఁకనీముందునిల్చుకవిత్వమే యుండదు కదా! పరాక్రమము నకుఁ బోల్పఁ గూడదా యేమి?

రసజ్ఞు— అవును జక్కఁగనే సమాధానముఁ జెప్పితివి. ఇంతకును మొదల శంకకే యవకాశ మగుపడదే.

పురో— పోనిండు. అట్లనే యనుకొందము. కుమారశక్తి, అనినఁ జాలదా? ఆయుత, శాలి, ఇవియెందుకు?

పరి— (కోపముతో) నీకు మంచిశంకలే తోఁచుచున్నవి కదా. రాజు, అను టకు బదులు భూపాలుఁడనుట గూడ నీమతమున దోషమే యగును గాఁబోలును.

వివే— ఆమెతోనేమి ! మఱియొకపద్యము చదువుము.

పురో— అక్కడికి నేనంత తెలియనిదాననవియా నీయభిప్రాయము ?

వివే— కాదు. ఒక్కొక్కరి కొక్కొక్కరీతి నచ్చును. తప్పేమి. ఇదినీకుఁ జక్కఁగలేదనియే మేమును నొప్పుకొంటిమి, ఇంకేమి కావలయును ?

రస— బాగుగ నొడివితివి "లోకోభిన్నరుచిః" లేకపోయిన నీపెకన్న మన కెక్కువ తెలియునా ? ఇఁక మఱియొకరిం జదివింతము. జన మెక్కుడుగనుంటచే నొక్కొక్కరి కొక్కొక్కటికన్న నధికముగాఁ జదువుట కవకాశ మీవలనుపడదు.

పరి— అవును మా కూలంకషకవనము వినుఁడు.

కూలం— మీయెదుట వినిపించుటకే నాకు సంశయ మగుచున్నది.

ఉ. పాఱినఁ జూచి కౌరవనృపాలుఁడు సూతతనూజుతోడ నీ
కాఱియ మద్బలమ్ము నకుఁ గాఁదగునే, వివిధాస్త్రసంపదన్
మీఱిన నీవు గల్గఁగ నమేయపరాక్రమ నీకుఁ బాండవుల్
మాఱి తలంపు నీదగుబలమ్మును జేవయుఁ జూపుమి త్తఱిన్. 2

(భారతము)

పురో— (చెవులు మూసికొని) నారాయణ, నారాయణా ! శివ శివా !

కూలం— (నిశ్చేష్టురాలగుచున్నది)

రస— ఏమి నీయభిప్రాయము ననుసరించి తెలుఁగు పదము లెక్కుడుగనున్నపద్దెమే చదివినదే, పాపము చెవులు మూసికొంటి వేమి ?

పురో— ఒక్కతెనుఁగుపదము లున్నతోడనే కలిగినదా యేమి వైకుంఠము! అశ్లీలము కనుపడుట లేదా. మొదటిపదమునుబరికింపుఁడు, "శ్రీమతేపేడదేవ్యైనమః" అన్నట్లున్నది.

వివే— ఎక్కడనో ఆశీర్వదాములలోఁ దప్ప నిట్టి యర్థము స్ఫురించుట తప్పుగాదు. అట్లయినచో నేకార్థమునే యిచ్చుపదములే మన భాషలో నరుదు.

రస— అవును. ఇట్టిదోషమును గుణగ్రహణముచేయువారు పాటింపరు. ఇంతకును నిది దోషమే కాదు.

పురో— అట్లయిన నీయిష్టము. నాకెందుకు.

"శ్లో. తదల్ప మపి నోపేక్ష్యం కావ్యే దుష్టం కథంచన।
స్యా ద్వపు స్సుందర మపి శ్విత్రే ణైకేన దుర్భగమ్"

వివే— అట్లయిన నీవిప్పుడు చదివినశ్లోకమును దోషగ్రస్తమే దోషము చెప్పకము వారి కేయున్నప్పు డితరుల కుండదా? దీనికేమి. ఓ! సర్వజ్ఞా! నీవు చదువుము.

సర్వ—

ఉ. ధరణీమండలి దిర్దిరం దిరిగెఁ బాతాళమ్ము ఘూర్ణిల్లె ని
ర్జరనాథప్రముఖాఖిలామర నివాసశ్రేణులం దోలిమై
నెరయన్ బంకజసంభవాలయమున న్నిండారె నవ్వేళ శ్రీ
కరమై తేయతనూభవోద్భవకథాకల్యాణ ముద్ఘోషమై. ౬

(నృసింహపురాణము.)

పురో— నాకెందుకుఁ గాని ఈపద్యము మున్నెప్పుడో విన్నట్టు లున్నది.

రస— ఇంతేకదా, ఈపెదలననే విని యుండవచ్చును.

వివే— కాదు కర్మముచాలక మొదటిపదము కొంచెము మార్పుగా "ధరణీ చక్రము దిర్దిరం దిరిగె" అని కూలంకష కవిత్వములోఁ గూడ నున్నట్టులున్నది.

పురో— అదుగో, ఆపె కనిపెట్టినది. గ్రంథచోరులుగాని కవులు గారు.

రస— అట్లయినచో నెవ్వరునునోరు మెదల్పుటకే వీలు లేదు. ఇట్టివి లక్ష లును కోటులును నీయవచ్చును. ఋషులకవిత్వములలో వేదములోని పదములును, తక్కిన సంస్కృతకవులకు వారలకవిత్వములోనివియును, దొరలుచునేయుండును. ఇట్లు తమయంతఁ దామేయాపదములుఁ గల్ప నలును వచ్చుటయుంగలదు. అది యొకతప్పుగాదు.

పురో— అట్లు సరిపెట్టికొన్నచో నేదియును దప్పుగాదు. పోనిండు దానికేమి, మూఁడవపాదములో నక్షీల మటుఉండఁగా, అంత అతిశయోక్తి

యెందుకు ? ఇది యీకాలమున నెవరు విశ్వసింతురు :

వివే— ఈకాలముమాట కేమి, చక్కఁగనేయున్నది, దీనికేమి. నిరాఘాటా ! నీవొక్కపద్యము చదువుము.

నిరా— (కంఠము సవరించుకొని)

ఉ. కంటికి నిద్రవచ్చునె, సుఖం బగునే రతికేళి, జిహ్వకున్
వంటక మిందునే, యితరవైభవముల్ పదివేలు మానసం
బంటునె, మానుషంబుగలయట్టిమనుష్యున కెంతవానికిన్
గంటకుఁడైన శాత్రవుఁ డొకండు తనంతటివాఁడు గల్గినన్. 4
(కాశీఖండము)

పురో— (చెవులు మూసికొని) హరః హరా!

రస— ఏమి యీవిరుద్ధము, ఈమె కెట్టికవిత్వమును రుచింపకున్నదే.

వివే— అదిగాదులే. కొంచె మన్వయించుకొనుటలోఁ బొరపడియుండును.

పురో— జిహ్వకున్, అన్నది ముందు కన్వయించుకోపలెనని నాకుఁ దెలియకపోలేదు. ప్రక్రమవశమున షష్ఠ్యంతముతో నన్వయము శీఘ్రముగా స్ఫురించకమానదు. కంటికిన్, అన్నదానితో నిద్ర, అనునది వలెనే, జిహ్వకున్, అన్నదానితో రతికేళి యనునది సందర్భింపదా?

రస— అఘోరించినట్లే యున్నది. దేనికేది యుచితమో అది దానితో సందర్భింపవలయును. మనలోపమును గూడ దానియం దారోపించుట వీలా? భోజనసమయమున సైంధవమును దెమ్మన్న గుఱ్ఱమును దెత్తురా! యానసమయమున నుప్పుదెత్తురా ?

వివే— చక్కఁగా సమన్వయించితివి. అట్టి వ్యంగ్యములు పాటించినచో నెవ్వరికుండవు ? ఏదీ నిర్దుష్టా! నీవొకటి చదువుము !

నిర్దు—

ఉ. ఓసరసీరుహాక్షి! వినవో రతిఁ గౌగిట నీవు చేర్చునిం
పాసురభర్తకైనఁ గలదా, వల దంచుఁ బెనంగ నేమి స

న్యాసినె, యొక్కచే తహతహన్ మన సొగ్గదు కేళిపై న నా
శ్వాసిత "దుఃఖితే మనసి సర్వ మసహ్యాము" నా నెఱుంగవే. 5

(మనుచరిత్ర)

పురో— (జుగుప్సతో) రామ రామా!

రస— ఇది యేమి కర్మము, ఏపద్యమును నీకు రుచింపదు. చక్కఁగా సంస్కృతశ్లోకపాదము గూడఁ బద్యములో నిమిడ్చి చెప్పెను గదా! ఆపరిశ్రమ మేని నీమనమునకురాలేదా ?

పురో- రాకేమి ? అరోచకముగా మాత్రమున్నది. ఇందాకటిపద్యమునకన్నను దలనొప్పి పుట్టించుచున్నది .

వివే— ఓహో నీబుద్ధి కడుఁ జక్కఁగా నున్నదే. యథాకథంచిత్తుగా నైనను దుష్టార్థము వచ్చినచో దానినే పట్టెదవు కాఁ బోలును. సురభర్తలోని 'సు' వెనుకనున్న "పా'తో నెందుకుఁజేర్చవలెను. దీనికేమి రసవతీ! నీవు చదువుము.

రసవ—

ఉ. ఆయమరాచలమ్ము ధను వై వి[illegible]మ్ముగా
వేయువిష[illegible]నొప్పు[illegible]
[illegible]ముఘనొక్కమాత్రమున నంగము వ్రియ్యఁగ మోఁది మించితొ
తీయనివింటనే వెనుకఁదీయనిటీరమునన్ మనోభవా ! 6

(చిత్రభారతము)

పురో— ఇందుఁ బదములును గూర్పును యతిప్రాసములును జక్కఁగనే యున్నవి. కాని, మనస్సునకుమాత్రము మూఁడుతట్టలు విశ్వాస ముండవలెను. కొండవిల్లేమిటి! ఆపైని చెఱుకుకట్ట విల్లేమిటి! విష్ణుమూర్తి బాణమేమిటి! ఏమైనను, ఇదివరకు విన్నవానికన్న నిదియే మెఱుఁగు:

రస— ఇది గూడ మొదలు పెట్టితివా! ఇది యెప్పటినుండి, పురాణ గాథ లన్నియును నసత్యము లనియే కాఁబోలును నీతాత్పర్యము!

వివే— పోనిమ్ము. అంతగాఁ జర్చింపకుము. కొంద ఱిప్పుడు పూర్వగాథ

లన్నియుఁ దప్పు లనియు నవి నమ్మ రాదనియు సిద్ధాంతము చేసి కొన్నారులే. తదనుసారముగాఁ జెప్పియుందును. వినోదినీ! నీవు చదువుము.

వినో—

ఉ. పయ్యెదఁబాపి గుబ్బలను బాహులఁ బట్టఁగ నిచ్చి మోవిపైఁ
దియ్యనిపానకమ్ము చవిఁ దీరఁగఁ గ్రోలఁగఁ నిచ్చి యిప్పుడో
తొయ్యలి నీవి ముట్టినను ద్రోచెద వేనుఁగు నిచ్చి యంకుశం
బియ్యక కయ్య మాడఁ దగునే నను నీగతి నేచఁబాడియే? 7

(శశిబిందుచరిత్రము)

పురో— చూచితిరా! యెంత సభ్యముగా నున్నదో.

రస— నీ కన్నియు నసభ్యములే. ఆసామెత యెంత చక్కఁగ నిమిడినదో పరిశీలింపుము.

వివే— అది గాదు. శృంగారరసము గూడఁ బురాణగాథలవలెనే వీ రంగీకరింపరులే.

పురో— అంగీకరింపకుండుట గూడ నొకతప్పిదమేనా యేమి!

వివే— మనకు వివాదమట గానీ, యొకటిమాత్రమున్నది. ఏయవస్థకుఁ దగినట్లు దానిని వర్ణించుట కవితాధర్మము. అట్లనే వేదాదులుగూడ నున్నయవి. ఇంతకును శృంగారము రసరాజము కదా. కవులశక్తిం గురిచిభోజుఁడు ప్రశ్నించినపుడు గూడ రతాంతమును వర్ణింపు మన్నట్లు వినుచున్నాము. నీవేమి, మఱికొందరేమి, ఆ వర్ణించిన కాళిదాసభవభూతులకన్నఁగాని, ఆయనకన్నఁగాని మిన్నలు కారు గదా! తొండ ముదిరిన సామెతగా నిప్పుడు కవిత్వము ముదిరి యేదో త్రోవకుఁ బోవుచున్నది. మన మంజుభాషిణి యూరకున్న దేమి?

మంజు—

మ. జలజాతాసన వాసవాదిసురపూజాభాజనం బై తన
ర్చులతాంతాయుధుకన్నతండ్రిశిర మచ్చో వామపాదమ్మునన్

దొలఁగందోఁచె లతాంగియట్లయగునాథుల్ నేరముల్ సేయఁ జే
రలుకం జెందినయట్టికాంత లుచితవ్యాపారముల్ నేర్తురే. ౯

(పారిజాతాపహరణము)

పురో— ఇదియును గొంత తలనొప్పిగనే యున్నది. ఐనను గొంత మెఱుఁగే. బాగుగఁ బరిశీలించిన నిదియును నశ్లీలదోషమునకుఁ దావే కావచ్చును.

రస— నాకిదే యాశ్చర్యము. ఈపె కేది చదివినను నివియే పొడకట్టెడివి. అయినను నయ్యది యెక్కడనో చెప్పుము.

వివే— రెండవచరణము మొదటఁ గాఁబోలును. మనచంద్రికను జదివింతము.

చంద్రి—

క. పో నుద్యోగము చేసిన । పాంథుండా యింక నీకు బాథేయం బీ
మానినిమందస్మితమధు । రాననచంద్రికలుగోరిలనరుగుముపిదపన్.

(మధుసేనము)

రస— ఓహో ! ఇది చంద్రిక యనుటకేతగును.

పురో— సంశయమేమి శుద్ధవైదికముగా నక్కడక్కడ నపరమంత్రములలోవలె పాథేయ మని ప్రయోగించనిచో నీవన్నట్లే.

వివే— దానికేమిలే! ఎక్కడనైనను, ఆ పదమునకు దారిబత్తెమనియే యర్థము దానిలో నంతతప్పిదములేదు. ఏదీ, ఆశ్లేషిణీ! నీకవిత్వము విని చాలకాలమైనది.

ఆశ్లే—

శా. రాజీవాక్షుల నేచుపాతకివి చంద్రా ! రాజవా నీవు నీ
రాజత్వమ్మునఁ జక్రముల్ మనియెనో, రాజిల్లి సత్సంతతుల్
తేజం బందెనొ డిందెనో యహిభయోద్రేకమ్ము, తాఁ జెల్లరే
రాజై పుట్టుట రశ్మిమాత్రఫలమే రాజౌట దోషార్థమే. 10

(వసుచరిత్ర)

రస— ఓహో! యెంతసేపు వినినను నీకవిత్వమే వినవలయును.

పురో— కాదా దిక్కుమాలినశ్లేష లేకపోయినచో నల్లే యనుకొనవచ్చును.
వివే— నీమాటల కేమిలే. నీ కేదియును బనికిరాదు. చింతచెట్టుక్రింద పిచిక సమర్తాడిన దన్నట్లున్నచో సంతసించెదవు. దీనికేమి ద్వ్యర్థకరీ! నీ వించుక కర్ణానంద మొనరింపుము.

ద్వ్యర్థ—

గీ. ఎందు వేట రారె యితరులే మనసుతో
దారసంగసుఖము తప్పఁజేసి
తకట! పాండురాజయశ మెన్న వైతతి
కూర్రిరదశరథేశ కులము రోయ. 11

(రాఘవపాండవీయము)

రస— ఓహో! ఎంతసుళువుగా రెండర్థములును వచ్చుచున్నవో! కవన మనఁగా నిదియే కదా.
పురో— రామాయణమును భారతమును వేఱువేఱుగాఁ జదువుకొన నేరరనికాఁ బోలును పాప మిశ్రమపడుట. అందులోఁ దప్పులెన్ని? బోలెడు.
వివే— ఒకచో జకారము పర్యాయముగా దంత్యతాలవ్యభేదముగా నుపయోగింప వలసి వచ్చిన దనియే కదా. ఇట్టివిషయములలో నదియొక క్లిష్టము కాదు. దీని కేమి. మనమృదులాంగి వాగ్వైభవము చూడుఁడు.

మృదు—

చ. వలఁ బడియున్నజక్కవకవ ల్బురణించుచు సన్నపైఁటలో
పల బిగిగుబ్బదోయి కనుపండువు సేయఁగ మోడ్పుచేతు లా
దలను ఘటించి మ్రొక్కిడి పదంపడి మెల్లన డాయఁబోయి తొ
య్యలి విరిబంతి దోయిఁట నుపాయన మాయనకిచ్చి యిట్లనున్. 12

(సుదక్షిణాపరిణయము)

రస— అహహా!! వీరి నొకరితో నొకరిని బోల్చుటకు వీలులేదు కదా. ఎవరికవనము విని వారినే మెచ్చికొనవలెను. ఒకరిని మెచ్చునప్పుడింకొకరిని స్మరించనే వలనుపడదు.

పురో— అట్టివారే. అయిననేమి శృంగారరసము పీరిని దాడుచేయుచున్నది. నమస్కరించిన దనుట కిన్నివన్నెచిన్నె లెందుకు ? కూర్పుమాత్ర మనుకూలముగానే యున్నది. యతిప్రాసములకు సంతోషించితిని.

వివే— పోనీ సీతల్లికడుపుచల్లఁగానంతవఱకైన సంతసించితివి. కొందఱవి గూడ ననవసరము లని వాదించుచున్నారఁటలే. దీని కేమి నిరుపమా ! నీవొక్కపద్యముచదువుము.

నిరు—

గీ. తండ్రితరమునఁ బెనిమిటితరమునందు
వీనమంత్రైనఁ బున్నెమ్ము చేసి యెఱుఁగ
వార్ధకమ్మున నింకేల వట్టి తొడుసు
కృష్ణుఁ దర్శింప కున్న నాకేమి చిక్కు. 13

(జైమినిభారతము)

రస— ఓహో ! యెంతస్వభావోక్తిగనో యుండియు రస మొలుకుచున్నది.

పురో— ఆఁ బాగుగనే యున్నది. పెనిమిటి యన్నమాట లేకున్నచోఁ గొంత యనుకూలముగా నుండును. ఏమైనను నిది కొంత గ్రుడ్డిలో మెల్ల యన వచ్చును.

వివే— పెనిమిటి యనుపదముం బట్టి గూడఁ గొంతశృంగార ముప్పతిల్లు చున్న దని కాఁబోలు. అది లేనిచో విధవ యగును గాన నట్లున్న కవనము మెత్తువేమి ? ఈ వెఱ్ఱిపరిశీలన కేమి గాని శృంగారవతీ నీవు చదువుము !

శృంగా—

ఉ. గందపుఁ గొండనెత్తముల కందువమేలిమి తీవయిండ్లలోఁ
గెందలిరాకుపాన్పున సుఖించి నితాంతరతశ్రమమ్ము ముం
జెందిన చెంచుగుబ్బెతలచెక్కులఁజిమ్ము జవాదివాసనల్
విందులు సేయుచుం మెలఁగు వేకువ కోమల గంధ వాహముల్.

(శ్రీరంగమాహాత్మ్యము)

రస— అహహా! అట్టిమందమారుతమిప్పుడు వీచుచున్నట్టులేయున్నది.

పురో— ఈ రసాభాస శృంగారమునకుఁ గూడ సంతసింపవలయునా?

వివే— చెంచుగుబ్బెత లనుటఁ బట్టి మ్లేచ్ఛగత మైన దని కాఁబోలును నీయభిప్రాయము. సరియే అయ్యాదియప్రధానముగాఁగూడ గ్రంథములలో నుండఁగూడదా? దీని కేమి మననవోఢన్ జదివింతము.

నవో— క. ఈ లలన వేలుపుంజవ
రాలోయచ్చరయొ, కిన్నరవధూమణియో
వ్యాళాంగనయో కాక
భూలోకస్త్రీల కిట్టిపొంకము గలదే. 15

(చారుదేష్ణచరిత్రము)

రస— నీవు నవోఢ వైనను నీకవితమాత్రము ప్రౌఢయే సుమా.

పురో— మెచ్చవలసినదే. గుజ్జుఁపుమూతి దానితోఁ బోల్చుట యేమి సొగసుగా నున్నదో, వ్యాళాంగన యన్నచోట "ళా" యనునది యెంత కటువుగానున్నది. పైన "కాకి" యని కూడ వచ్చినది. ఇయ్యది నవోఢకును దక్కువదశలో నున్న దానికవిత్వ మన్నఁ దప్పేమి?

వివే— ఇది వెట్టిపరిశీలన. దీని కేమి! పరిహాసినీ! నీవొక్కటి చదువుము!

పరి— గీ. దొంగవలె వచ్చి యిచ్చట డొంగినా వ
దేమయా బావగారు పెద్దామె కోప
గించినందులకా బళా! మంచివాఁడ
వేమనందును ముసలాపె యే వివేకి 16

(వైజయంతీవిలాసము)

రస— మంచి యౌచితిగా నున్నయది. లంకలోఁ బుట్టిన వాళ్ళందరును రాక్షసులే యన్నట్లొకరి కొక రెప్పట్టునను దీసిపోరు.

పురో— ఇందులో నౌచిత్యమున కేమిగాని క్త్వార్థక సంధియొకటియు "వివేకి" యొకటియు నవివేక ప్రయోగములు.

వివే— ముసలాపె కనుక వివేకిని యను మని కాఁబోలును, అదియును సాధింపవచ్చును. త్ర్యర్థకసంధి కేమి తఱచుగాఁ జేయుచునే యున్నారు. పోనిమ్ము మనవిరాగిణిం జదివింతము.

విరా-ఉ. వారక వారకామినుల వర్తులచారు కుచోపగూహముల్
కోరక కోరకోల్లసిత కుంజములన్ జిగురాకు పానుపుల్
చేరక చారుకేరళకళింగకుళింగ నరేంద్రమందిర
ద్వారవిహారులై సిరుల నందక నెందకపాణిఁ గొల్వరో. 17

(కవిజనాశ్రియము)

రస— శయ్య యనఁగా నిట్లుండవలయును. వైరాగ్యమైనను సరసముగా బోధించు చున్నయది.

పురో— శయ్య చక్కఁగనే యున్నదిగాని, ఇందులోఁ గేవలనింద్యమైన వారస్త్రీ ప్రశంస యున్నది. దానివలన రసాభాసముకూడ స్ఫురించక మానదు: "ఏకత్రైవానురాగశ్చే" త్తనునది యెవరెఱుఁగనిది.

వివే— ఇది వఱకుఁ జెప్పినవానివలననే యియ్యది దత్తోత్తరము కావచ్చును. ఏదీ జయశీలా: నీవొకటి చదువుము.

జయ— క. ఏరికి బుద్ధిబలమ్ములు। కారణములు గావు సూవె కలరె ధరిత్రిన్
నేరిచి బ్రతికినవారలు। నేరక చెడ్డట్టివారు నీరజనేత్రా. 18

(రాజశేఖరచరిత్ర)

రస— ఏమి చక్కనిపాకమో, చూచితిరా: లోకములో ననుకొనియెడి మాటలు గూడ నందులో నతిధారాళముగా నిమిడ్చినది.

పురో—ఈపద్యము నాకును సమ్మతముగనే యున్నది, చిగురున సంబోధనము స్త్రీపర మేమో అది కొంత నాకుసరిపడదు, ఇట్టి పద్దెము స్త్రీని గూర్చి చెప్పవలయునా ? లేక పురుషసంబోధనమైనను నేత్రవర్ణనమెందులకు ?

వివే— అవును. దీపస్తంభమువలె సంబోధించినఁ జక్కఁగా నుండును. పోనిమ్ము మలయవతీ: నీవుచదువుము.

మల— ద్విపద. రాణివాసద్రోహి రావణుఁ బట్టి
ఘోణిమి చెరుపవా బుధులు నుతింప. 19

(రంగనాథరామాయణము)

రస— ద్విపద యైనను హృద్యముగా నున్నయది.

పురో— దీనిలోఁ జెరుచుధాతుప్రయోగము కొంత జుగుప్సాకరము. పైచిల్లర మొట్టమొదట మిశ్రసమాస మొకటి.

వివే— ఈ జుగుప్సలకును, ఈ మిశ్రసమాసములకును నేమి ? శతమును సహస్రమును నున్నవి. శాస్త్రమును నొప్పికొనును. ఏదీ మనోజ్ఞా ! నీవొకటి చదువుము.

మనో—

చ. ఎఱిఁగి యెఱింగి మున్నతఁడె యెగ్గొనరింపఁడె దానికై కదా
చెఱఁగొనివచ్చితిన్ బిదప సీత వృథాకథ లింక నేల పెం
పఱ బ్రిదు కింత తీయనె ఖరాదులచావున కేమి గాని నీ
మఱచలిబన్న మేపగిది మానిని యీగుదు సంధి చేసినన్. 20

(భాస్కరరామాయణము)

రస— ఏమని మెత్తును ? సర్వోత్కృష్ట మంటినా తక్కినవారి నవమానించి నట్లుండును.

పురో— దీనిలో గాదెవపేరుండుటచే నాకంతగా రుచింప దాయె. అందుల కంగీకరించినను మానిని యనుపదమున కర్థము మానము కలది యనియే కదా ? చూడుఁడు దానిలో నెట్టియపాత్రఁపు స.గతి పొదకట్టు చున్నదో. తక్కినదిబాగుగనే యుండవచ్చును.

వివే— బాహ్యాదిశబ్దములవలెనే యిది యిటీవల పెట్టుకొన్నసంజ్ఞ. దీనింబట్టి తప్పన వలనుపడదు. దుర్జయా ! నీవొక్కటి చదువుము.

దుర్జ—

శా. గంగాసంగమ మిచ్చగించునె మదిం గావేరి దేవేరిగా
నంగీకార మొనర్చునే యమునతో నానందముం జెందునే

రంగత్తుంగతరంగహ స్తముల నారత్నాకరేందుప్రిండు నీ
యంగ మ్మంటి సుఖించెనేని గుణభద్రాద్రి తుంగభద్రానదీ ! 21
(పాండురంగమాహాత్మ్యము)

రస— ఓహో ! ఏకవిత్వములు వినుటవలన సంతోష మట్లుండఁ బై పెచ్చు విచారము కలుగుచున్నది కదా, ఒక్కొక్కపద్యమువంతున వినవలసి నవా యియ్యవి ?

పురో— అట్టివారే, అయిననేమి. ఈపద్య మంతా అబద్ధమే కదా, నదులఁట సముద్రిమఁట ! అబద్ధఁపుపెండ్లి కేదో వాద్య మన్నట్లున్నది.

వివే— అపెతో నేమి పద్మినీ ! నీవు చదువుము.

పద్మి—

గీ. తల్లియును దండ్రి దైవమ్ము తలఁప గురుఁడు
కాఁడె యితఁడేమి చేసినఁ గనల నగునె
నాస్తి కాధమ యోరి యన్యాయవృత్తి
"నాస్తి తత్త్వం గురోఃపర" మ్మనఁగ వినవె. 22
(శృంగారషష్ఠము)

రస— నిర్దుష్టమై నిరాఘాటమై యీధార లాక్షణికులకుఁ గూడ మార్గప్రదర్శక మగుచున్నది.

పురో— చిగురునన్నట్లు వారికే యుపయోగము కాని, మొదట సముచ్చయ ముతో నారంభించి తక్కినశబ్దముల కయ్యది లేదుకదా ! పైచిల్లర నాస్తి కుల నిది యొకమిషపెట్టి తిట్టినట్లు తోఁచుచున్నది.

వివే— అవును, వ్యంగ్యమే కదా కావ్యమునకు ముఖ్యము, "జీవితం వ్యంగ్యవైభవ" మ్మనుటకూడ నీకుఁ బనికిరాదు కాఁబోలును. దీని కేమి సదూహా ! నీవుచదువుము.

సదూ—

శా. అనిష్ఠానిధిగేహసీమ నడుదే యాలించినఁ మోప్రియు నెం
తేనాగేంద్రశయానుపుణ్యకథలున్ దివ్యప్రబంధానుసం

ఘానఘ్వానము "నాస్తిశాకబహుతా" "నాస్త్యుష్ణతా" "నాస్త్యపూ
పోనాస్త్యోదనసౌష్ఠవంచ కృపయాభో క్తవ్య" మన్పల్కులున్. 23

(ఆముక్తమాల్యద)

రస— ఈ కూర్పు నేర్పును స్వభావోక్తియును జెవులకుఁ జవులుగొల్పు చున్నవి.

పురో-ఇదిస్వభావోక్తి యని నీకుఁదక్క నెవ్వరునుబొగడరు. రెండవజామున భోజనము స్వభావోక్తియే కాఁబోలును "రాత్రౌ యామం నలంఘయేత్" సర్వమును నాస్తియైనప్పుడు భుజించుట యెట్లు? అదిగాక నాల్గవచరణము మొదట "పోనాస్తి" అనునది తిండిలేదు పోవలసినది. అనిసూచన చేయుచున్నది.

వివే— ఇదా నీవు యోజించినది? అన్నదాతల స్వభావమును దెలిసికొన వలెను "పోనాస్తి" అనునది వేఁజేవిఖుచుటకన్న తెలివితక్కువ మఱి యొకటి యుండదు. దీనికేమి కమలాక్షీ! నీవుచదువుము.

కమ—

ఉ. వల్లభుఁ డేగు దుర్లభుఁడు వానిదెసన్ దగు లూని యిమ్మెయిన్
దల్లడ మంచె దేల? యుచితస్థితికి న్నినుఁ బాపఁ జూపినన్
దల్లియు బంధులోకమును దండ్రియు నేమనువా రెఱింగరే
నుల్లమ నీకు నిట్లు తగునో తగదో పరికించి చూడుమా. 24

(విజయసేనము)

రస— నిరుపమానముగా నున్నయది. నీతికిం గూడఁ దోవఁజూపుచున్నది.

పురో— నీతికి లోపమేమి? జారతా విషయమును జక్కఁగా బోధించు చున్నది.

వివే— ఏవిషయము నుండక కవిత్వ మనఁగా దేవతార్చనమంత్ర మను కొంటివా యేమి? నానావిధములుగా నుండవచ్చును, ఎవరికేది యిష్టమో వార లద్దానిం దిలకింతురు, సుమధ్యా! నీవుచదువుము.

సుమ—

సుగంధి. అంగనాలలామ గానవా లతాకుడుంగమా
తంగమా భుజంగమా పతంగమా కురంగమా
లుంగమా లవంగమాతులుంగమాధవీనటప్
భృంగమావనీరమా కరీరమా సమీరమా. 25

(రామాభ్యుదయము)

రస— శబ్దములపొందిక యట్లుండఁ బైపెచ్చెంతో స్వభావ మొలుకుచున్నది.

పురో— సంశయ మేమి ? ఇంత వెఱ్ఱి యెవని కేనియుండిన యెడలఁ గదా ? ఇదిస్వభావోక్తి గావలయును.

వివే— ఏకదేశమును జూచి గాని, లేక తనకలిమి యిందఱిభోగ మన్నట్లు గాని చూడఁ గూడదు. నానావిధముల నుండవచ్చును. లేదాయించుక యతిశయోక్తి గావచ్చును. మునిఁగిపోయిన దేమి ? మందగమనా నీవు పఠింపుము.

మంద—

క. నిన్నుఁజెఱఁగొన్నహైహయు, కన్నన్ దోర్వీర్య మెక్కుడగుభార్గవుఁ డి
లన్నిర్జించినరాముని, కన్నను శూరుండు ముజ్జగమ్ములఁ గలఁడే. 27

(చమత్కారరామాయణము.)

రస— ఒకరికన్న నొకరు, పొగడ నెవరితర మగును ?

పురో— దోషములవిషయ మేనా నీవుచెప్పినది ?

వివే— రెండవచరణమందుఁ గాఁబోలును నిశంక కవకాశము. ఇవికుశంకలు. అట్లయిన నశ్లీలము లేని చెక్కడ? మాలతీ నీవు చదువుము.

మాల— ఉ. ధన్యుఁడు విశ్వభూవిభుఁడు దారుణి నేలఁగ భూజనంబు ల
న్యోన్యహితత్వసంపదల నందిరి దంపతులింపు నింప న
న్యోన్యసుఖానుకూలతల నోమిరి విప్రులు వేల్పుపిండు న
న్యోన్యపుష్టివృష్టికుశలాదుల నొందిరి నాఁడునాఁటికిన్. 27

(కావ్యాలంకారచూడామణి)

రస— ఆధారదొరలెడిరీతి యెవ్వరికి మెచ్చు గొల్పదు?

పురో— ధార అట్టిదే కాని "తుంటి కొట్టినపండ్లు రాలె "నన్నట్లు హేతువు మాత్రము బాగున్నదికాదు. దంపతులసుఖమునకు రాజెందుకు హేతువు కావలెను ?

వివే— సమ స్తమునకును రాజుయోగ్యతయే కారణము కావచ్చును. దానసేమి లోపము. దంపతులుమాత్రము రాజుయోగ్యుఁడుగానిచో సుఖము నందఁ గలరా ? దీనికేమి. సారంగీ ! నీవుచదువుము.

సారం— గీ. ధర్మతనయ యుష్మదాజ్ఞానిగళవిని
బద్ధ మగుచుఁ జిక్కువడియెఁ గాక
విజయ మ త్తగజము విడివడ్డచో నడ్డ
పాటు గలదె విష్టపత్రియమున. 28

(అథర్వణాచార్యునిభారతము)

రస— ఆనందించుట తప్ప మఱియొకమాట కవకాశము లేదు.

పురో— "విజయ" అన్నచోట "భీమ" అనియన్నచో నవకాశము లేనేలేదు.

వివే— అట్లని రాజాజ్ఞా యేమి? ఇదియును సొగసుగనే యున్నది. చందన లతా ! నీవుచదువుము.

చంద—

చ. ఘననిబిడాంధకారరిపుఖండన చండమయూఖ రాజిచే
ననుదినమున్ బ్రభాతములయం దమృతాంశుమరీచు లేగఁగా
వనజములుల్లసిల్లఁగఁ దొవల్ ముడుఁగన్ బ్రథమాద్రిఁదొల్చున
ద్దినమణికిన్ నభోమణికి దేవశిరోమణి కేను మ్రొక్కెదన్. 29

(మార్కండేయపురాణము)

రస— సర్వవిధములచేతను మనోహరమై యున్నయది.

పురో— అవునుగాని, సూర్యుని పేళ్ళన్నియు నుపయోగించినచో నిఘంటుగాఁ జూచుకొనవచ్చును.

వివే— రెండవసారి తద్వాచకమే ప్రయోగించినందులకుఁ గాఁబోలును, దానికేమి యొకటి విశేషణము చేసికొనఁ గూడదా ? రక్తాక్షీ ! నీవు చదువుము.

రక్తా—

ఉ. చక్కఁదనంపుదీవియగు సాహిణిమారుఁడు మారుడై వడిన్
బొక్కపడం గలండు చలమున్ బలమున్ గలయీచళుక్యఁపున్
జొక్కనృపాలుఁ డుగ్రుఁడయి చూడ్కుల నిప్పులు రాలఁజూచినన్
మిక్కిలి రాజశేఖరుని మీఁదికి వచ్చిన రిత్తవోవునే. 30

(భీమనచాటుధార)

రస— కవిత్వము శాపముగాఁగూడ నుపచరించెడిదే, సందియమేమి?

పురో— శపించుటకు వీరే కావలయునా కోపము వచ్చినవారెల్ల సమర్థులే, జరుగుటమాత్రము సున్న. ఈపద్యములవలన నట్లు జరిగినదని కూడ తేలుట లేదుగదా?

వివే— లేనిచో ననాదిగాఁ బెద్దలెందుల కిట్లు చెప్పికొనవలయును ? దీనికేమి చమత్కారిణీ ! నీవుచదువుము.

చమ—

గీ. తగినమగవానికౌఁగిటఁ దగిలినట్టి
యలిచికురయౌవన మ్మది యౌవనమ్మ
తగనిమగవానికౌఁగిటఁ దగిలి నట్టి
యలిచికురయౌవన మ్మది యౌ వనమ్మ. 31

(చమత్కారమంజరి)

రస— ఎంతస్వభావసిద్ధముగనో యుండి పదచమత్కృతికూడఁ గన్పట్టు చున్నయది.

పురో—అట్టిదేకాని, "కౌఁగిట" అనుటచే మోటుగానున్నది.

వివే— ఏమియును లేక, "భోజనము చేసితిని" "నిద్రించితిని" అని చెప్పిన చోఁగవిత్వమే కాదు. కావ్యలక్షణములో "సాలంకారౌ" మొదలైన

విశేషణము లెందుకుఁ జేర్చిరో నీవెఱుఁగనే యెఱుఁగవు. దానికేమి కల్ప లతా ! నీవు చదువుము.

కల్ప—

చ. హృదయగతిన్ బురాతనకవీశ్వరు లేగనివీధి లేదు నేఁ
దదనుమతిన్ రచించుకృతి తాత్వికులన్ గరఁగించ కుండునే
మదగజరాజముల్ చనినమార్గమునన్ గడునింపు నింపవే
మదగజరాజయానపదమంధర బంధురయానమానముల్. 32

(కవికర్ణరసాయనము)

రస— న్యాయమైన మాట చెప్పినది. ఒకరితోఁబోవ లొకరికి రాకమానవు. అయినను వారివారి మాటలం బట్టి రసము వేఱు కాకతీరదు.

పురో— కవిత్వమునకుఁ గూడ స్త్రీలనే సరిచూచుకొనవలయునా ! ఇంతటి ప్రపంచములో నుపమానము మఱియొండు లేకుండెఁగాబోలు.

వివే— రసరాజము శృంగారమేకదా ! దానికి స్త్రీపురుషులే ముఖ్యము. దీని కేమి గభీరా ! నీవుచదువుము.

గభీ—

క. మీరిందప్రపృష్టము గని, నారా పాండవులఁ జూచినారాసుఖులై
వారందఱునొకచోను, న్నారావీరాగ్రగణ్యునరు నెఱుగుదురా.

(విజయవిలాసము)

రస— ఇది మఱియు విచిత్ర మైనఫణితి. దీని కిదియే సాటి.

పురో— తన కవసర మెంతవఱకో అంతే ప్రశ్నించవలయును గాని య ధికప్రసంగ మెందుకుండవలయును ? అయినను నియ్యది మెఱుగే యనవచ్చును.

వివే— అదృష్టమే అంతతో తెమల్చినావు. ఆపోగను కనిపెట్టుట కష్టములే. దానికేమి, ఉదారా ! నీవుచదువుము.

ఉదా—

శా. నాతో మార్కొనలేరు నిర్జరపురీనాగేంద్రబృందారకా
రాతుల్బ్రహ్మస్సుగ దేవసంఘములు, పోరన్ ధీరసంగ్రామకుం
డై త్రైలోక్యమునందుఁ గల్గఁడు రణం బెచ్చోట లేకుండఁగా
జేతుల్ వేయు వృథాభరం బగుచు వచ్చెన్ దేవ యీ మేనికిన్. 34

(సోమునిహరివంశము)

రస— దివ్యమైనధార. కడుసొగసుగా నున్నయది.

పురో— లోకమును బాధ చేయుట కింతకన్న శత్రువులుండరు.

వివే— ఇది కాఁబోలు నీమతాత్పర్యము. దీనికేమిలే. ఇప్పుడు కొందఱు తమకంటె పూర్వ మేవిషయమునను నెక్కువవారున్నారని చెప్పుట కొప్పరు. బాణాసురునకు వేయి చేతులని కాని రావణునకుఁ బదితలలని కాని యాంజనేయులు నూఱామడసముద్రము దాఁటె నని కాని చెప్పినతోడనే యవి యసత్యము లనియుఁ గవు లిట్లు బొంకి లోకమును మోసపుచ్చి రనియుఁ దిట్ట మొదలు పెట్టుచున్నారు.

రస— అయ్యవి వట్టికల్లలే యందురా లేక యెట్లేని సమర్థింతురా!

వివే— సమర్థింపనివారే పలువురు. అందులోఁ గొందఱు. ఆంజనేయులు దాఁటినసముద్రము నూఱడుగు లుండవచ్చు ననియు, నతఁడు మనుష్యుఁడేకాని కోతి కాడనియు నతనికిఁ దోఁక యుండె ననుట బొత్తుగా నమ్మఁదగదనియు, నాగరికాగ్రగణ్యుఁ డగుటచే బారగోచీ పెట్టు వాడుక కల్గి యుండవచ్చు ననియు దానినే మనవారు తోఁకఁగా నూహించి రనియు సమర్థించుచున్నారు.

రస— ఏడిచినట్లే యున్న దీసమర్థనము. ఇది వినలేముగాని మఱికొన్ని సమర్థనములు నేనును విన్నాను. దశరథుఁ డఱువదివేలసంవత్సరములు రాజ్యముచేయుటకు బదులుగా నఱువదివత్సరములు చేసె ననుట యుక్తమనియు, దానికి రాముని యరణ్యావాసము పదునాలుగు వత్స

రములుమాత్రమే యగుటయే ముఖ్యనిదర్శనముగాఁ జూపవచ్చు
ననియుఁ గొందఱు చెప్పుచున్నారు.

వివే— ఇట్లు చెప్పువారు నిరంకుశులు, శ్లో. "యౌవనే విషయైషిణా"
మన్నది గ్రామ్యార్థము నిచ్చునని యోజించి తప్పొప్పు లెఱుఁగక
"విజిగీషుణా" మని దిద్ద మొదలిడెడివారిముందఱ నొకటి నిల్చునా?
వీరితోనేమి! సుగీతా! నీవు చదువుము.

సుగీ— క. పురసతులవిలోకనములు। సరసాలాపములు నర్మసంభోగములుఁ
మఱిగి హరి మనల నొల్లఁడు। నరవరు లోయమ్మ నూతనప్రియు
లగదే. (భాగవతము)

రస— ఓహో! ఇట్టికవిత్వమే లేదనిన నేమితప్పిదము?

పురో— రేఫశకట రేఫములమైత్రి గూర్చుటకేనా?

వివే— దానికేమి, వీనిం గలుపనివారేలేరు. వల దనువారు చెప్పెడియుక్తులు
గూడ నంతసహేతుకములుగా నుండవు. నడల కున్నంతమాత్రమును
జాంధవ్యము వీనికుండదు కాఁబోలును. దీనికేమి కళావతీ! నీవు
చదువుము,

కళా—

ఉ. ఎన్నఁడు నేరిచెన్ బెళుకు లీచెలికన్నులు, కౌఁకుకమ్మ ల
న్నన్న కురుల్, పిఱుందు పటువై పటువై ఖరి గైకొనెన్ గదే,
మొన్నఁ గదమ్మ పిన్న మొనమొల్కలు నేఁడివె వన్నెలాఁడివేఁ
జన్నులు మిన్నలై పయఁటసందున డాఁగుడు మూఁత లాఁడెడున్ 36
(సరసమనోరంజనము)

రస— ఇది నిరుపమానము. దీనిశైలివర్ణింప వాక్కులు చాలవు.

పురో— దీనికేమి మఱియొకరిన్ జదివింపుము.

వివే— ఈమెకు శృంగారమురుచింపదు. శాపినీ! నీవు చదువుము.

శాపి— క. ఖలుఁడైన నీలభూపతి
యిలలో నిన్నాళ్ళు బ్రతుకునే నరసాంబా

గళకలితదివ్యతరమం
గళసూత్రోత్కృష్టమహిమ గాకకుమారీ. ౩౭
(చంద్రరేఖావిలాపము)

రస— తిట్టుకవిత్వ మైనను మృదుమధురముగనే యున్నది.

పురో— దానికేమి. "మంగళ" అను నది లేకపోయినచో బాగుగ నుండును.

వివే— ఇట్టి కుశంకలు పౌరకవిపద్యమే యుండదు. మనము రసారసములు చూడవలెను. ఆనందింపవలెను.

రస— రసారసవిచారము మనకు శక్యము గాదు. శ్లో. "శిశుర్వేత్తి పశుర్వేత్తి వేత్తి గానరసం ఫణీ, కోవేత్తి కవితాతత్త్వ మీశ్వరో వేత్తి వా నవా"

వివే— అవును చక్కఁగాఁ జెప్పితివి. ఎవరికవనము విన్నప్పుడు వారినే మెచ్చుకొనవలయు నని మన మనుకొన్నదియే కదా.

రస— అంతకన్న వీలే లేదు. అందులకే కదా మురారిమహాకవి—

"చ. ఒక రొకరుండ్రు వీరవరు లొక్కరి కొక్కరు తీసిపోరు, భూ
మికి యశ మబ్బె రావణుని మెచ్చిన నం చనుకొందుమేని వా
లిక్ నతఁ డింత జంకె లవలేశము లొక్కట నుండి కన్నులుం
టకుఁ గని మీను లుంటకు వినం వగు నల్వుల మేమిచెప్పఁగన్" 38

అని యిట్లు చెప్పి యున్నాఁడు.

వివే— ఎఱుఁగనేర్చినవారి కింతకన్న వేఱొకయుపాయములేదు.

(అని యందఱును నిష్క్రమించుచున్నారు.)

గద్య— ఇది శ్రీకింకవీంద్ర ఘటాపంచానన, విద్వత్కవి, బాలకలానిధి బాల సరస్వతీ, శతావధాని తిరుపతి వేంకటేశ్వర ప్రణీతంబై శ్రీకామేశ్వరి కర్పించిన యపూర్వ కవితా వివేచనమను ప్రహసనము

సమాప్తము

శ్రీ శ్రీ శ్రీ

శ్రీమత్పరదేవతాయైనమః

# స్కూలు పిల్లప్రహసనము



శ్రీ

తిరుపతి వేంకటేశ్వరకవులు

శతావధానులు.



ప్రకాశకులు :

చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి సన్సు,

వేంకటేశ్వర పబ్లికేషన్సు

కడియం P. O.

తూర్పు గోదావరి జిల్లా.

1955



## * ఇందువచ్చు పాత్రలు *

సుబ్బారావు

అవధాన్లు

శంకరరావు

శ్రీమత్పరదేవతాయైనమః.

# స్కూలుపిల్లల ప్రహసనము



[సుబ్బారావును, అవధాన్లును, అను నిద్దరు విద్యార్థులు ప్రవేశించుచున్నారు]

సుబ్బారావు— ఏమిరా అవధానీ? కబుర్లేమి చెప్పవు?

అవధాని— ఏమున్నవి. ఏమన్నా ఉంటే నీవేచెప్పాలి.

సుబ్బా— చెప్పడాని కేమిగాని మనదేశము మహోన్నతదశకు రావలె నంటే యేలావస్తుంది? మనస్కూలుపిల్లలలోనే తగినంత కట్టుబాటులేదు. ఇంకా యితరులు మన కేమివింటారు ?

అవ— ఏమీ ! ఆలాగు అంటున్నావు మనలోమనకులేని కట్టుబాటేమిటి?

సుబ్బా— కట్టేమిటా? ముందు నిన్ను చూస్తే నాకు ఒళ్ళుమండుతుంది. ఇంగ్లీషు చదువుతున్నా వన్నమాటేగాని లేశమాత్రమైనా నీకు తెలివి తేటలు గలిగినట్టు తోచదు. గోష్పాదమువలె జుట్టుపెట్టుట మానినావు కావుగదా ! నీకెప్పుడో బలవంతముగా ఆకాస్తమర్యాదా జరగాలి లావున్నది.

అవ— నీపుణ్యమాయిరి గాని నాకు పునఃకేశఖండనమహోత్సవము మాత్రము జరపకండి. మీరంతా జుట్లు కత్తిరించుకొని దేశాన్ని మహోన్నతదశకు తెచ్చినప్పుడు చూతాము.

సుబ్బా— ఇదా నీతెలివి ? ఇందుకే యూరోపియన్లు మనలను చూచి అసహ్యించుకొంటారు. దానిచేత మనకు తగిన ఉద్యోగాలు కావు. ఏమంటావా ! మనజుట్టు, మనబొట్టు, మనకట్టు చూచి వీడికి మూడోహస్తమున్నట్టున్నదని యోచిస్తారు.

అవ— ఏమీ వాళ్ళను చూచి మనముమాత్రము ఎందుకు అసహ్యించుకొనకూడదు? ఆచారమా? వ్యవహారమా! శుచా! శుభ్రమా?

సుబ్బా— (రౌంపరతో) ఆగు. ఏమా! ఏమ్రమా? అనికూడా అంటున్నావు? వాళ్ళపవిత్రిస్సు యెంతపవిత్రముగా ఉంటుంది? నీకాసంగతి తెలియదు. నీవు శుద్ధ మూఢుడవు. నీపేరుకూడా నీకు మావాళ్ళు తగినట్టేపెట్టేరు.

అవ— నాపేరుసంగతి నీవంటివాళ్ళకు తెలియదులే? అవధాని యనగా నిశ్చలమైన మనస్సుకలవాడుగాని గడియకు జుట్టు కత్తిరీ, గడియకు గిరజా, గడియకు వట్టిపోటితలా చేయించుకొను చంచలచిత్తుడు కాడు. వాళ్ళశుచికి నీవే సంతోషించాలి.

సుబ్బా— ఆశుచిసంగతి నీకు తెలియదులే, దానికేంగాని నీకును నాకునుగల తేడా మనవిలియమ్ శంకర్రావు నడుగుదాం. అడుగో వస్తున్నాడు.

(అంతట శంకరరావు ప్రవేశించును)

సుబ్బా— ఏమిరా శంకర్రావు! వీడికిన్ని నాకున్ను గలతేడా నిష్పక్షపాతంగా చెప్పు దానికి అవుసరంవచ్చింది.

శంక— (నవ్వుచు) తేడాకేమి? ఇద్దరూ మనుష్యులే. అన్నీ సమానమే. ఇద్దరూ తెలివి గలవాళ్ళే. నీవు నియ్యోగివి, వాడు వైదీకి.

సుబ్బా— సరే నీవు క్రైస్తవుడవు. ఈభేదమా నిన్ను చెప్పుమన్నది? తెలివితేటలలో ఆలోచించు.

అవ— తెలివితేటలకేమి, ఎవడికున్నంత వాడికుండవచ్చును, దైవమిచ్చింది మనము తెచ్చిపెట్టుకుంటే రావుకదా? ఈవిచారణతో నా కవుసరము లేదు. నీమో స్తరుగా దేశము మహోన్నతస్థితికి వచ్చుటకు జుట్టు కత్తిరింపులు వగైరాలు హేతువులుగా నాకు తోచదు. నన్ను తెలివి హీనుడని మీ రనుకొనుటకు అభ్యంతరం లేదు.

శంక— ఏమీ నేను చెప్పినదానిలో తెలివితేటలను గురించిమాత్రము లేదా?

సుబ్బా— ఉన్నది కాని అంత గుంభన యెందుకు? అరటిపండు ఒలిచినట్టుండాలి.

శంక— చెప్పడానికేం గాని అట్లాగే చెప్పవచ్చు. వీడికికోపం వస్తుందేమో? వాడు శుద్ధవైదీకి గదా!

అవ— (కోపముతో) నీప్రుణ్య మాయిరి గాని నీవు మాత్రము నన్ను వీఁడు, వాఁడు, అని అనడం మొదలుపెట్టకు. మావాళ్ళు వింటే నన్ను చివాట్లు పెడతారు.

సుబ్బా— ఓరేయి? నీవు వానిని నీవు అనవచ్చుగాని నిన్ను వాఁ డనకూడదేం? నీకేం కొమ్ములు వచ్చినవి కాఁబోలు.

అవ— మీకంత చర్చ యెందుకు? నన్ను పిలవడమే మానివెయ్యండి. నేను సాజింప్వ కోసినా ఇతణ్ణి విశేషించి మన్నించను. నేనే కాదు. ఈచదువు కారణము కాని లేకపోతే ఎవ్వఁడున్ను ఇతణ్ణి ఈమాత్రమూ గౌరవించఁడు సరికదా దగ్గరకైనా రానివ్వరు.

శంక— సుబ్బారావూ! నీవూరుకోరా. అదేమిటో నేను కనుక్కుంటాను. అవధానీ? నీవేమిటో ఆకాశమునుంచి ఊడిపడ్డట్టున్ను. మేము పాతాళంలోనుంచి వచ్చినట్టున్ను ప్రగల్భాలు కొడుతున్నావు. ఈకాలంలో ఇవి సాగవు. నీఆటలు సాగే రోజులు పోయినాయిలే. అయినా అదేమిటో చూదాం నాతక్కువేమిటో నీయెక్కువేమిటో చెప్పు?

అవ— (మరింతకోపముతో) నీవు నన్ను పిలవ వద్దు. నీవు అవాచ్యుఁడవు. నీవు నాతో సంభాషించనే వద్దు.

సుబ్బా— (నవ్వుచు) మిస్టర్ శంకరావు! వీఁడు శుద్ధమూర్ఖుఁడు. ఫ్రెండ్షిప్పంటే వీఁడి కర్థమే తెలియదురా.

అవ— నీకు బాగా తెలుసును గద! మాల మాదిగలచేత ఏమిరా అని పిల్పించుకోవడమే ఫ్రెండ్షిప్పుకు లక్షణం కాఁబోలు.

శంక— (నవ్వుచు) ఏమిరా అవధాన్లూ! దేవుఁడు నిన్నుసృష్టించినట్లు వాళ్ళని సృష్టించలేదురా?

అవ— నీకు కోపము లేకపోతే చెప్పగలను. నీమతాన్నిబట్టి కోపం ఉండకూడదు గదా! ఏమోలే;

సుబ్బా— ఏకోపమున్న నీకేకాని మా కెవళ్ళకీ అలాటివిలేవు. అదే ఉన్నట్టయితే ఇంతసేపు నీతో మాట్లాడనేలేము.

అవ— నీకెందుకోయి ప్రతిసంగతికి నీవే వస్తావు.

శంక— అతడు రాఙ్లే. అదేమిటో చెప్పు, వింటాను.

అవ— నీవు మొదటే పర్లక్షుడవైనా ఇప్పుడు మామతమునుబట్టి ఆఖరుజాతిలో వాడవేకదా ? నీకిచదువురానిచో నీవేమిపనిచేయవలెనో :

శంక— (కొంచెమునవ్వుచు) ఆసంగతికూడా నీముఖతహాగానేరానియ్యి.

సుబ్బా— చెప్పేదేమిటి మనమెరుగమూ ఏరయితువద్దరనో పాలేరుతనం చెయ్యాలంటాడు.

అవ— అక్కడికది పెద్దగౌరవమైన ఉద్యోగమే. అప్పుడు నిన్నేమనిపిలుస్తారో నీవే యెరుగుదువు.

శంక— (తలపంకించుచు) ఆదేగౌరవ మయిన ఉద్యోగమేమి ! అదిలేకపోతేనో ?

అవ— చెప్పేదేమిటి మ్యునిసిపల్ వారికి సహాయము చేయుటే. గ్రామపారిశుద్ధ్య మంతయు నీమీఁదనే జరుగుతుంది.

శంక— (కోపముతో) సరే నీకీ చదువు లేకపోతే నేను చెప్పనా ?

అవ— చెప్పే దేమిటి వేదం చదువుకుంటాను. లేదా శాస్త్రం చదువుకుంటాను. అదీ లేకపోతే సంగీతం సాహిత్యం దెబ్బై పదకొండు విద్యలున్నాయి. ఎట్లాగయినా గౌరవమునే పొందఁ గలను.

శంక— ఆవిద్యలు లేనివాళ్ళు మీలో లేరా ?

అవ— ఉన్నారు. ఉన్నప్పటికీ మీ అంతనీచపు పనిలో ఉండరు. ఏనీళ్ళకావిళ్ళో మోసుకుంటారు గాని.

శంక— అప్పుడు వాళ్ళని గౌరవిస్తారు కాఁబోలు.

అవ— వృత్తినిబట్టి గౌరవం లేకపోయినా జన్మతోవచ్చినగౌరవం మాత్రం పోదుగదా;

సుబ్బా— ఈ నీచప్రసంగాని కేంగాని మన మెప్పుడున్నూ ఉన్నతస్థితిని గూర్చి మాట్లాడాలి (శంకరావు వైపునకు చేయి పెట్టి చూపుచు)

పడితే పెద్ద జడ్జో గిడ్జో అవుతుం దనుకో. అప్పుడు వీడి దగ్గిర నీవు గుమాస్తాగా ఉన్నట్టయితే ఏమని పిలుస్తావు ?

అవ— ఏమండీ మహాప్రభో అని పిలుస్తాను. దానికేమి.

శంక— అప్పుడు నానీచత్వము ఎక్కడికి పోతుందో :

అవ— ఎక్కడికిన్నీ పోదు. అది నీజన్మాంతరమువరకున్నూ వదలదు. అప్పుడైనా ఆగౌరవం నీకు చేసిందికాదు. నిన్నుపట్టుకున్న అధికారపిశాచానికిసుమా ఏమనుకున్నావో. గుళ్ళోరాయికిమొ్రక్కుటకు కారణము దానియందారాధింపబడిన దేవతకే అని ఎవరెరగంది ?

సుబ్బా— వరే శంకరా్రవు : వీడు ఇల్లాటి చాద స్తపువాదములున్నూ, కుయుక్తులున్నూ బాగానే నేర్చుకున్నాళ్లే. నీకు కోపంరావడానికి విగ్రహారాధనమాట తెస్తున్నాడు చూచావూ ?

శంక— నాకు కోప మంటావు నీకుమాత్రం ఇష్టమా యేమిటి ?

అవ— మీయిద్దరికీ ఇష్టం లేదన్న హేతువుచేతనేనా విగ్రహారాధన పోవలసింది.

శంక— కావలసినన్ని కారణములచేత ఖండించవచ్చును.

అవ— ఏదీ వకటి రెండు కారణములు చెప్పూ ?

శంక— రాతిలో నిజంగా దేవు డున్నాడా ?

అవ— నిజమైనభక్తి ఉన్నయెడల ఉండనే ఉన్నాడు. వెనక కబ్బిలో ప్రహ్లాదుడు దేవుణ్ణి చూపెట్ట లేదా ?

సుబ్బా— నేను బుజ్జిలో చూపించాను. నీపుక్కిటిపురాణాలు నమ్మేవాళ్ళకి చెప్పు. నే మొదట చెప్పనే చెప్పేను గదా ! నీకింకా వెర్రి నమ్మకాలు పోలేదని, నీకు ఇంగ్లీషు చదువువల్ల లాభం బొత్తిగా కలుగనే లేదు. నీవు నాగరికతగల పట్టణములలో ఉండతగిన వాడవు కావు. ఏపల్లెటూళ్ళోనో ఉండతగిన వాడవు.

శంక— బాగా చెప్పేవు. ఇతడు నాగరికతగల పట్టణముల్లోకి పనికేరాడు.

అవ— నేనట్లనే ఉంటాను కాని. విగ్రహారాధన యెందుకు పనికిరాదు ? పురాణము లెందుకు నమ్మకూడదు ? మీమాటలమాత్రము విలువ యున్నా వాటికో లేదా ?

సుబ్బా— విగ్రహారాధన మూర్ఖుల కని కదా మనవాళ్ళు చెప్పుతారు. అది పండితులు కూడా ఎందుకు చేస్తారో చెప్పనా ?

అవ— విగ్రహారాధన క్రమంగా దేవుణ్ణి తెలుసుకొనుటకు సాధనం. అంతే నేకాని పండితులు చేయకూడ దని లేదు. అందరూ చేయవచ్చును. దానివల్ల నష్టంలేదు,

శంక— అన్నీ నష్టాలే.

సుబ్బా— ఒక్కనష్టంచెప్పూ ?

శంక— మీవేదములలో ఎక్కడైనా విగ్రహారాధనచేయమని లేదుకదా?

అవ— వేదంలో లేకపోయినా మంచిపనిచేయవచ్చును. ఉన్నా చెడ్డపని చెయ్యకూడదు.

సుబ్బా— ఆగు మంచితోవకు వచ్చినావు. ఉన్నా చెడ్డపనిచేయకూడదని గదా చెప్పితివి ? యజ్ఞాలని పేరుపెట్టి నవరంధ్రాలున్నా మూసేసి మేకల నెందుకు చంపుతారో చెప్పు.

శంక— వహ్వా ! బాగాఅడిగినావురా !

అవ— అది మంచిది కాదని తోచుటచేతనే కాబోలు ? మన కంతగా తెలియదుగాని రామానుజాచార్యులు మొదలైనకొందరు మతకర్తలును మనువు మొదలగు కొందరు స్మృతికర్తలును దానికి మారుగా పిష్ట పశువుని ఏర్పరచినారు. దానిని గురించి మీరు నన్నుకొత్తగా అడగ వలసినదిలేదు, నేను మీకు చెప్పవలసినది అంతకన్నాలేదు.

సుబ్బా— కాలాన్నిబట్టి అవసరమయిన మార్పులు చేసుకొనుట నీకూ యిష్టమే కదా ?

అవ— కాకేమి ! తగినంత హేతువుమాత్రం లేనిజుట్టుకత్తిరింపులున్నా

మాలగుడ్డలతో అశుచిగా తినడమున్ను మొదలైన వెట్టిమార్పులు మాత్రం పనికిరావు.

సుబ్బా— మరికెసీరు తాయిబట్టలకన్న చాకింటి యిస్త్రీబట్టలు శుభ్రంగా ఉండవా ? పేలతో బాధపడుటకన్న తలగొరిగించుకొనుట శుచికి హేతువుకాదా ?

అప— సరే నీరుకావి యంటేనే అర్థం నీకుతెలియదులే. నీటిచే కావిరంగు వచ్చినబట్ట. చాకింటియిస్త్రీబట్టకన్న అనేకవిధముల పవిత్రముగా ఉండును. ఇక పేలకు భయపడి బోడితలలు చేసికొందుమేని యీ పని అంగీకారమే. ఈవిషయమై మనకన్న స్త్రీలు చాలా కష్టపడుదురు. వారలకున్నూ అట్లే జరిగించుటకు మీరేల పూనుకొని ఉపన్యాసము లివ్వరు ? పేలకు భయపడి తలగొరుగుకొనుటయు, అగ్నికిభయపడి ఇల్లుపడగొట్టుకొనుటయు, నల్లులకుభయపడి మంచం విరగగొట్టుకొనుటయు, ఉద్యోగాలు కావని కులం చెడగొట్టుకొనుటయు కన్న తెలివి తక్కువ వేరేయుండదు గనుక—

మ. "తనధర్మంబున కన్యధర్మ మవిరుద్ధం బెంతయో నంతగై
కొని వర్తించిన వ్యావహారికులు తన్గొట్టించిరే, యింటఁ జే
సినయాచారము వారి నేమిటికి హింసించున్ మతాచార మూ
నని మాత్రమ్మునఁ దాను పెద్దదొర యౌనా తల్లి : కామేశ్వరీ"

అన్నట్లు. అవుసర మైనవియు బాధలేనివియు అయినమార్పులు తప్ప ఈవెట్టిమార్పులవలన దేశమున కథోగతి వచ్చి మనపేరుకూడా మొట్ట మొదటికి నశించిపోవునేగాని ఔన్నత్యమునకు రానేరదని నానమ్మకము.

మ. "మును నుద్యోగులు లేరొ వారలు ధనమ్ముం గూర్పరో పూర్వవ
ర్తనల న్మానిరె పూనిరే మలినమౌ ధర్మమ్ము వారిట్లు లే
మసవచ్చునె బ్రిక్రృతప్రపంచగతి వర్ణాచారముల్ మారె నె
వ్వని నెవ్వండని నిశ్చయింపఁ దగు నోవామాక్షి ! కామేశ్వరీ"

సుబ్బా— ప్రజలకు రాజానుసరణము కూడా తప్పే కాబోలు.

అన— తప్పుకాదు. అది యెంతవరకవసరమో అంతవరకు తప్ప అధిక మెందుకు? మిజుల్లు, కట్లు, బొట్లు, మార్చుకొనుడని సురాజులు మిమ్ములను శాసించుచున్నారా! లేదు. కావున యిట్టి వెఱ్ఱిమార్పులున్నూ, తారతమ్యజ్ఞానములేని సంబోధనములున్నూ దేశౌన్నత్యమునకు కారణములుకావు. ఇంతకన్న పూర్వాచారముల యందలి ఆదరము దేశౌన్నత్యానికి కారణమైనా కావచ్చును. అట్టిసమూహ ఇప్పుడు వర్ధిల్లు చుండుట కెంతయు సంతోషము. స్వదేశవస్తువుల యందువలెనే, స్వవేదముల యందును స్వశాస్త్రములు మొదలగువానియందును మనకు నానాటికి అభిరుచి నిచ్చి భగవంతుడు మనలను వృద్ధిలోనికి తెచ్చి రక్షించుగాక.

( అందరును నిష్క్రమించిరి )

— గ ద్య —

ఇది శ్రీ కింకవీంద్ర ఘటాపంచానన, విద్వత్కవి, బాలకలానిధి

బాలసరస్వతీ, శతావధాని తిరుపతి వేంకటేశ్వర ప్రణీ

తంబై శ్రీ కామేశ్వరి కర్పించిన సూర్యాలు

పిల్లల ప్రహసనము సమాప్తము

శ్రీ శ్రీ శ్రీ

# ముఖ్యమైన సవరణలు

| పేజీ. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 4 | 24 | బా | బ్రా |
| 10 | 13 | డివి | డిని |
| 12 | 10 | దర్షి | ధర్షి |
| 13 | 20 | ప్యా | స్యా |
| 14 | 20 | జ్మ్ర | జ్మ్ర |
| 15 | 1 | వీ | లీ |
| 16 | 3 | వ్రాకు | వాక్రు |
| 17 | 6 | ఖి | ఖి |
| 25 | 14 | ద్రి | ధ్రి |
| 31 | 14 | సు | గ |
| 31 | 23 | ర్వ | ర్వా |
| 32 | 3 | ద్య | ద్వ |
| 44 | 22 | దా | ధా |
| 44 | 24 | న్మో | న్యో |
| 46 | 11 | యనా | యునా |
| 53 | 4 | దె | దే |
| 53 | 7 | ఎ | ఏ |
| 54 | 25 | నెప్ప | చెప్ప |
| 58 | 17 | ఆడి | అడి |
| 59 | 3 | కొయి | కావి |

వేంకటేశ్వర ప్రింటింగు ప్రెస్. ఆలమూరు. తూ. గో. జిల్లా.